టచే నీతనికి వైదికమతమందుఁగాని, తద్వ్యాప్తికొఱకుఁగాఁ బ్రారంభింపఁబడిన భారతాంధ్రీకరణమునఁగాని యాదరము లేకపోయి యుండును.

ఇఁక నన్నయ తిక్కనల మధ్యకాలమున నున్నవారిలోఁ బ్రసిద్ధపురుషుఁడని చెప్పఁదగినవాఁడు మంత్రి భాస్కరుఁడు. తిక్కనాదు లీతనిని ప్రసిద్ధకవిగాఁ జెప్పినను రామాయణకర్తయని చెప్పకపోవుటచే నా విషయమున భిన్నాభిప్రాయములు కలవు. అయిననట్టి ప్రసిద్ధకవియగు వాఁడు నన్నయ మొదలుపెట్టి మధ్యను వదలివేసిన భారతామ్నాయమునే గైకొని తెనిఁగింపక, యద్దానిని తన మనుమనికి వదలివేయఁదలఁచినవాఁడు వలెఁ దాను రామాయణమును జేపట్టుటకుఁ గారణమేమై యుండును? రాజరాజు గతించిన పిదప నన్నయ భారతమును రచించెనను ప్రసిద్ధియేగాని యాతని గ్రంథమునకు దేశమునఁ బ్రచారము లేకయుండవచ్చును, కావున నాంధ్రీకృతభారతము నీతఁడు చూచి యుండకపోవచ్చును. అంతేగాక మంత్రిభాస్కరుని కుమారుఁడగు తిక్కభూపాలుఁడు వైష్ణవమతావలంబకుఁడై పాకనాడు, కమ్మనాడు మొదలగు దేశములలో వైష్ణవమతవ్యాప్తికిఁ దోడ్పడుచు, కాంచీపురమునందలి వరదరాజస్వామియం దత్యంతభక్తి గలవాఁడై యనేక విష్ణ్వాలయములను నెలకొల్పినట్లు తెలియుచుండుటచే, తండ్రియగు మంత్రి భాస్కరుఁడును గొంతవఱకు వైష్ణవమతాభిమానము కలవాఁడై యుండెనని తలంపఁదగును. ఆ కారణముచే నితఁడు వైదికవ్యాప్తికి దోడ్పడు భారతమును విడిచి, వైష్ణవమతోద్బోధకమగు రామాయణము నాంధ్రీకరింపఁదొడంగి యుండును. తిక్కభూపాలుఁడైనను వైష్ణవమతమునం దభిమానము కలవాఁడై యున్నను, తక్కిన మతములందు ద్వేషబుద్ధిలేక పరమత సహనము కలవాఁడై యుండెను. కవితిక్కన యన్ననో హరిహరులకు భేదమేలేదని తలంచుటచే నద్వైతభావమే కలవాఁడై, మరల నన్నయ భారతమును జేపట్టి తెనిఁగింప దొరఁకొనెను. దేశమున నూతనమతములను వ్యాపింపఁజేయుచున్న కాలమున వారి బోధనలచే నాకర్షింపఁబడినవారిలా నొక్క కుటుంబముననే కొందఱి కొకమతమందును, మఱికొందఱికి మఱియొక మతము

వాతి కాలమున కొంత వైష్ణవాభినివేశముగల బుద్ధరాజు రామాయణమును ద్విపదగా రచించియుండును.

బుద్ధభూవిభుండు రచించిన రామాయణమునకు 'రంగనాథ రామాయణ' మను పేరు వచ్చుటకు రంగనాథుఁ డనునాతఁ డొకఁ డా గ్రంథమునకు ప్రతివ్రాసికొని దానిపైఁ దనపేరు వ్రాసికొనియుండుటయు, ప్రాచీనపు తాటియాకు ప్రతులు గొన్నిటిపైఁ గనఁబడు నీతని పేరునుబట్టి యది రంగనాథుని రామాయణమని యవిమర్శముగ నొక ప్రతీతి దేశమున వ్యాపించుటయునే కారణమైయుండునేమో యని యిటీవలఁ గనుఁగొనఁబడిన తంజావూరు సరస్వతీ మహల్‌లోని రంగనాథ రామాయణము యొక్క ప్రాచీనమునైన తాటియాకు వ్రాతప్రతులనుబట్టి యూహింపఁ దగియున్నది. ఇట్లు ప్రసిద్ధులయి, పేరు ప్రతిష్ఠలుగల కవులందఱు మతాభినివేశమునకు లొంగినవారై, యేదో యొకవిధముగ వైదికమత మందాదరము లేనివారే యగుటచే నన్నయ తరువాత సుమారు రెండు వందల యేండ్లవఱకు భారతాంధ్రీకరణము పూర్తియగుట సంభవింపలేదు.

ఈ మధ్యకాలమున మిగిలిపోయిన ప్రసిద్ధ కవులలో [illegible] డొకఁ డున్నాఁడు. ఇతఁడు తిక్కనకుఁ గొంచెము పూర్వుఁడో సమకాలికుఁడో యని చెప్పఁదగియున్నాఁడు. నన్నయ తరువాత నన్నయ యంతవాఁ డీతఁడని లోకప్రసిద్ధి గలుగుటచే నీతఁడు ద్వితీయాచార్యుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. ఆప్రసిద్ధికిఁ దగిన కారణమును లేకపోలేదు. ఏలయన నన్నయ తరువాత నాతఁడు మొదలుపెట్టిన యుద్యమమును లేదా గ్రంథమును కొనసాగింపవలయునని తలఁచి కృషిసల్పినవారిలో తిక్కనకుఁ బూర్వ మీతఁ డొక్కఁడే కనఁబడుచున్నాఁడు. భారతమున నన్నయ రచించిన మొదటి మూఁడు పర్వములు గాక తరువాతి విరాటోద్యోగ భీష్మ పర్వము లీతఁడు రచించిన ట్లగపడుటచే నన్నయ యుద్దేశమును గొనసాగింపఁ బూనుకొనినవాఁడువలె నున్నాడు. ఇతని పుట్టుక పూర్వోత్తరములనుగూర్చి తెలిసికొనుట కాధార మేమియులేదు గాని

ప్రచారమున లేకుండుటయు మఱియొక కారణమగుచున్నది. కావుననే నన్నయను గూర్చిగాని, యాతని భారతమును గూర్చిగాని యాతని తరువాత తిక్కన కాలమువఱకు నెవ్వరును ప్రశంసించినవా రగపడరు. చూచినవారు, చదివినవారు లేరు. తిక్కనయయినను ప్రథమమునఁ దాను రచించిన నిర్వచనోత్తరరామాయణమున నన్నయప్రశంస యేమియుఁ జేసినవాఁడు కాఁడు. ఆంధ్రభాష కాదికవియని, ఆంధ్రభాషావాగనుశాసనుఁడని తరువాత నంత ప్రసిద్ధిగాంచిన నన్నయ పేరైన నెత్తలేదు.

"హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూత్న సత్కవీశ్వరులను భక్తిఁగొల్చి" యున్నాఁడు. ఆ యాదికవులలో (వాల్మీకివ్యాసులా?) గాని. నూత్న సత్కవీశ్వరులలోగాని నన్నయకూడ నుండెనో లేదో చెప్పలేము. ఆ కాలమున నన్నయ రచించిన భారతభాగము విశేషముగఁ బ్రచారములో నుండి, యందఱచేఁ జదువఁబడుచు నాంధ్రభాషకు మహిమం గూర్చుచునే యున్నచో, తిక్కన తాను స్వయముగా నద్దానిం జదువుటచేతనే కవితావిలాస విస్తరమహాసియుఁ బైనెగడినచో నా యాదికవి యగు నన్నయ నామమునైన నొకసారి తన మొదటిగ్రంథమున స్మరింపకుండునా? ఉత్తర రామాయణ రచనకుఁ బూర్వము భారతభాగమును జదివియున్నచోఁ గొఱవడియున్న యా పంచమవేదమును బూర్తి చేయఁ గడంగక రామాయణము నేల చేపట్టును? ఇంక నాతఁడు యుద్ధము చేయలేడనిగాని, కవితాసామర్థ్యము చిక్కలేదనిగాని చెప్పుట యుక్తి సహితముగాఁ గనఁబడదు. అట్లయైనను. ఉత్తర రామాయణమును నాతనిఁ జేకొనకుండుటకుఁ గారణమగపడదు. ఇఁకఁ దాను భారత రచనకుఁ గడంగినప్పుడైనను నన్నయ భారతమును స్వయముగాఁ జదివి యాతని కవితాపద్ధతులందును, రచనా విశేషములందును, నత్యంతాదరము కలవాఁడువలె నా భారతరచనము గూర్చి కాని, తద్రచయిత యొక్క గొప్పతనమును గూర్చిగాని యేమియుఁ జెప్పక, భారతమును మాత్రము విశేషముగాఁ బొగడుచు,

"వైదికమార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచు
న్వేదములేని భక్తి నతినిర్మలవృత్తిగఁ జేయుచుండు మ
త్పాద నిరంతర స్మరణ తత్పరభావము కల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచునుండు వృష్ణిన"

ఇట్టి వైదికమార్గమునందలి ప్రీతియు, పంచమవేదంబగు భారతము మూలముగా నా మతమునందలి ధర్మాద్వైతస్థితిని వ్యాపింపఁజేయు సుద్దేశమును, చాళుక్యప్రభువులొనర్చిన మహాత్కార్యమునందలి గౌరవమును వారి ప్రోత్సాహమున భారతాంధ్రీకరణకార్యమునకుఁ బూనిన నన్నయ యందలి భక్తియుఁ గారణములుగాఁ దాతఁ దొనర్చిన మూఁడుకృతులను వదలి తిక్కన తక్కిన పర్వముల నాంధ్రమున రచింపఁబూనినట్లూహింపఁ దగియున్నది. అంతేకాని నన్నయ రచించిన భాగమును సంపాదించి, చూచి, చదివి, యానందించి, దానిమూలమునసే కవితావిలాసవిస్మయ మహానీయుఁడై మిగిలిన భాగమును బూరించినట్లు తోఁచదు.

## అరణ్యపర్వ శేషపూరణప్రశంస

తిక్కన నన్నయవ్రాసిన గ్రంథభాగమును జూచినాఁడన్నచో నన్నయ మూఁడు కృతులు సంపూర్ణముగా వ్రాసియుండిన గాధలేదుగాని, యట్లుగానిచో, రాజ్యతంత్ర మవలీలగ నడపి, పరదేశములకేఁగి రాజుల మెప్పించి పరమతముల ఖండించి దిగ్విజయముగాంచి యత్యంత మేధావంతుడును, ధైర్యస్థైర్యములు గలవాఁడునని పేరుగాంచిన తిక్కన యరణ్యపర్వభాగమును బూర్తిచేసినచో మృత్యువువాతఁ బడుదునేమో యను భయముచేఁ బిఱికివంటివలె వెనుదీసినాఁడని చెప్పవలసివచ్చును. తిక్కన నన్నయభారతమున మూఁడుకృతులు సంపూర్ణముగా నుండుటను జూచి నాగ్లపకృతి ప్రారంభించినాఁడన్నచో రాజమహేంద్రవరమునఁగల మూలప్రతి నీతడెట్లో విశేషప్రయత్నముచేసి సంపాదించి ప్రత్యంతరమును

వ్రాయింపఁబూని తిరిగి పంపినాడనియో, లేదా, యే గణపతిదేవుని యాస్థానమునకుంబోవు సమయమునఁ రాజమహేంద్రవరమునకుఁబోయి యా ప్రతిని జూచివచ్చినాఁడనియో చెప్పవలెను. కాని దేశమున ననేక ప్రతులున్నవనియు, నా ప్రతులన్నింటిలో మూఁడుకృతులు సంపూర్ణముగా నున్నవనియుఁ జెప్పినచో తిక్కన తరువాత నేఁబది యరువది సంవత్సరములలో నెఱ్ఱాప్రెగ్గడ చూచునప్పటికే దేశమునఁగల ప్రతులన్నిటిలో నొక్కభాగము మాత్రమే పాడుగా శిథిలమైనదనుట విశ్వాసపాత్రమెంతమాత్రము గాదు. ఎఱ్ఱాప్రెగ్గడకు దొరికిన ప్రతిలోఁ గొంత భాగము పోయియుండెననినచో, నన్నయ వ్రాసిన భాగము తరువాత నైన దొరికియుండవలెనుగదా. దీనిని బట్టి నన్నయ యరణ్యపర్వము పూర్తి గాకుండ వ్రాసెననిపోఁగా, నాతని తరువాత నా గ్రంథము నావరించు ప్రత్యంతరములను వ్రాయించి వ్యాప్తిలోనికిఁ దెచ్చువారు లేకుండుటచే తిక్కన యీ భారతప్రతిని చూడనేలేదనిగాని, దేశమున దానికి ప్రచారము లేకుండుటచే, నొక్కటే ప్రతియుండఁగా నద్దాని నెట్లో తిక్కన చూచి, యందు మూఁడు కృతులు సంపూర్ణముగానుండుటచే నాల్గవపర్వమును మొదలుపెట్టి పూర్తిచేయఁగా, గొంతకాలమునకు ప్రతియందలి చివరభాగము శిథిలమైపోఁగా నెఱ్ఱాప్రెగ్గడ దానిని బూరించెననిగాని, లేదా, తిక్కన యసంపూర్ణ గ్రంథమునే చూచినను మిత్రద్రోహ భయముచే నా భాగమును బూర్తిచేయక వదలివేసెననిగాని, మూఁడువిధములుగా మనము తలంపవలసియున్నది, ఇందు మూఁడవదానికంటె రెండవది, రెండవదానికంటె మొదటిది సంభావ్యంబై బలవత్తరముగా నున్నట్లు తోఁచక తప్పదు. ఏది యెట్లున్నను అరణ్యపర్వమును నన్నయ సంపూర్ణముగా రచించెననియు, మూఁడుపర్వములు దేశమున బాగుగా ప్రచారములో నుండఁగా, తిక్కన యొకప్రతిని జూచి నాల్గవపర్వము మొదలుపెట్టి భారతమునంతయు పూర్తిచేసెననియు, నాతని తరువాత నలుబదియేండ్లకు నరణ్యపర్వమునం దుది భాగముమాత్రము పుచ్చిపుచ్చి క్రిమిదష్టమై శిథిలముకాఁగా నెఱ్ఱాప్రెగ్గడ నన్నయ పేరెపెట్టి యా శిథిల

భాగము నచ్చటచ్చట పోయిన వర్ణనములను, పదములను, పాదములను
స్వయముగా నతికి తద్రచనయ నారణ్యపర్వశేషమును పూరించెననియుఁ
జెప్పుటమాత్రము సమంజసముగాఁ గనబడదు. నన్నయ భావములు,
పదగుంఫనములు, వాక్యవైఖరి అక్కర వృత్తప్రయోగము, మొద
లగు రచనా రీతులెన్నియేని యీ భాగమునఁ గనబడుచున్నవి గావున
నీ భాగముకూడ నన్నయ రచించినదే; వర్ణపద పాదముల పూరణము
మాత్రమే యెఱ్ఱాప్రెగ్గడచేసిన పూరణమనుటయు నెంతమాత్రము యు
క్తము కాదు. ఏలయన నెఱ్ఱాప్రెగ్గడయే "తద్రచనయకా" పూరిం
చితి నని వ్రాసికొనినాఁడు. ఒక పర్వములో చివర కొద్దిభాగముమాత్రమే
కొఱవడియుండుటచేతను, తక్కిన పర్వము లన్నియు తిక్కనార్యుఁడు
రచించియుండుటచేతను, ఆ స్వల్పభాగముకూడ నన్నయపేరనే యుండుట
యుక్తమని తలంచి యాతని రచననే యనుకరించి పూర్తిచేయుటకు
యత్నించి, యట్లే చేసితినని చెప్పికొనియున్నాఁడు. ఇప్పుడు మనము
చూడవలసిన దేమనఁగా నీ యనుకరణ ప్రయత్నములో "తద్రచనయ
నకా" — నన్నయ రచనయే నని చూపించుటలో నీతఁ డెంతవఱకు
నెగ్గినాఁడు? ఎక్కడ నే భేదము లేక నన్నయ యే దృష్టితో భారత రచ
నను మొదలుపెట్టి రచించినాఁడో, ఆ దృష్టితోడనే తానును రచించుచు,
నన్నయ రచనా పద్ధతినంతను దెచ్చి యీ భాగమున నిలిపినాఁడా లేక
కాలక్రమమున భాషలోఁ గలుగుచుండెడి మార్పులు, తిక్కన రచించిన
తక్కిన భారత భాగమును జదువుకొనుటవలనఁ గలిగిన కవితా సంస్కా
రము నీతని యరణ్యపర్వశేషరచనలో నేమైనఁ బొడసూపుచున్నవా యని
మన మించుక పరిశీలించినచో, నిది నన్నయ రచన యగునా, ఇతఁడు
చేసినది శిథిల గ్రంథపూరణమా లేక యనుకరణ పద్ధతిమీఁద జేయఁబడిన
స్వతంత్రరచనమా యను విషయము నిర్ధారణచేయుట కవకాశము కలు
గును. అటుపైని ఈ యరణ్యపర్వభాగ పూరణము "తద్రచనయకాఁ"
జేయుటకుఁ గారణము, నన్నయ దుస్స్వభావదుర్వ్యాపారము కారణముగా
నాతనికిఁ గలిగినదని తరువాతివారు బయలుదేఱఁదీసిన మతిభ్రమణ కథా

మూలకమగు భయమా? లేక నన్నయ తిక్కనలు తలపెట్టి పూర్తిగా వించిన యుద్యమమందలి భక్తియా యను విషయము కూడ తెలియఁగలదు.

ఈ సందర్భమున నన్నయ భారతభాగమును (అనఁగా మొదటి రెండు పర్వములు - మూఁడవ పర్వము 4 వ ఆ. వరకు) తరువాతి యెఱ్ఱాప్రెగ్గడ రచించిన యరణ్యపర్వ శేషభాగముతోఁ బోల్చి చూడ వలసిన యావశ్యకత యేర్పడుచున్నది. ప్రస్తుత మరణ్యపర్వ శేష భాగములోని యక్కరపద్యములను నన్నయ భారతభాగములోని వానితోఁ బోల్చి పరిశీలించినచో నవి యేతద్విషయ నిర్ణయమునఁ గొంతవఱకుఁ దోడ్పడఁగలవని తోఁచును. నన్నయ తరువాత నక్కరవృత్తము లాంధ్ర కవితలో నంతరించినవి. తిక్కనార్యుఁడుగాని, సన్నెచోడాదులు గాని వాడియున్నట్లగపడదు. ఎఱ్ఱాప్రెగ్గడయైనను తన యితర గ్రంథములలో వాడలేదు. నన్నయ రచించినట్లే తానును "త్రిదయనకా" రచింపఁబూని నాఁడుగనుక ఈ వృత్తములను వాడినాఁడు. అక్కరపద్యములు కనఁబడు చున్నవి గావుననే యిది నన్నయరచితమే, యనినచో నీపద్యముల లక్షణ మొక్క తీరుననే యుండవలయునుగదా. కాని దీనిలో లక్షణభేదము కొంత గానవచ్చుచున్నది. నన్నయ మధ్యాక్కరలలోఁ బ్రతిపాదమునను నాల్గవగణము తరువాత యతి పాటించినాఁడు. కాని యెఱ్ఱాప్రెగ్గడ మూఁడవగణము తరువాతనే యతి పాటించినాఁడు. తెలుఁగు లాక్షణికు లందఱు నీ పద్యమునకు లక్షణము చెప్పుటలో నన్నయ రచించిన పద్య ముల లక్షణమును గ్రహించి చెప్పక, యెఱ్ఱాప్రెగ్గడ రచించిన పద్య ముల లక్షణమునే గ్రహించి, అనఁగా ప్రతిపాదమునను రెండింద్రగణ ములు నొక సూర్యగణము గలిగి మూఁడవగణము తరువాతనే యతియని యిట్లు మధ్యాక్కరలకు లక్షణము చెప్పియున్నారు:

"ఓజతో విద్దరింద్రులును
నొక్క యాదిత్యుండు మఱియు

రాజితంబుగ నిద్దఱమర
　　　　రాజులు నొక్క సూర్యుండు."

—అనంతుడు

"మునుపుగాఁ బ్రాసంబుఁగూర్చి
　　　　మూఁటిపై విరమంబు నిల్పి
చన నింద్రయుగళంబుమీఁద
　　　　జలజాప్తు నొక్కనిఁజేర్చి
యినుమడించిన నాలుగణము
　　　　లెనసిన నొక్క పాదంబు
వనర వక్కాణించినంతఁ
　　　　దగునిట్లు మధ్యాక్కరంబు."

—అప్పకవి

మొదటి రెండున్నర పర్వములలోని యక్కరపద్యముల లక్షణమును గ్రహించి చెప్పక, తుది పర్వములలోని పద్యలక్షణమునే, యా పద్యలక్షణముగా లాక్షణికులు గ్రహించుటచే, నప్పటికే యిప్పటివలెనే మొదటిభాగములోని నన్నయ మధ్యాక్కరలకు లక్షణము సరిగా కుదరని చిక్కుగా నుండుట తటస్థించినదని చెప్పవలసియున్నది. యుద్ధమల్లుని శాసనములోని యక్కరలలో నాలవగణము తరువాతనే యతి కనఁబడుచుండుటనుబట్టి నన్నయ యీ ప్రాచీన సంప్రదాయమునే యవలంబించి యుండుననుటకు సందేహములేదు. నన్నయభాగములోని పద్యములలో లక్షణము సరిగాఁ గిట్టకుండుటకుఁ గారణ మీ పద్యములు దేశీయములై, మాత్రాగణబద్ధములై, యంతకుపూర్వము దేశీయులచేఁ బాటలలో నుపయోగించుకొనఁబడినవై యుండుటచే నా పాటల కనుకూలముగా నొక్క మాత్ర హెచ్చించుటయు, నొకటి తగ్గించుటయు సంభవించుచు నియతమైన లక్షణము లేకుండుటయే యై యుండును. కన్నడభాషలోని యక్కర

ఇది ఛందోవిషయకమైన భేదము. ఇఁక భాషాభావసామగ్రీ విషయమునను, కథావస్తు ప్రదర్శనారీతులను నన్నయ కవితయను, నారణ్యపర్వ శేషకవితకును గల వ్యత్యాసము నారయుదముగాక. అరణ్యపర్వశేషమును నన్నయరచనవలెనే గనఁబడునట్లు చేయుట కనేక ప్రయత్నములను చేసి—అనఁగా నాతఁడు ప్రయోగించిన యక్కర వృత్తములను ప్రయోగించియు, నాతని పద్యములఁబోలిన పద్యములను "పయనిపలత్తురంగమతరంగములన్" ఇత్యాదులను రచించియుఁ నన్నయకు స్వాభావికములగు పదబంధనములను దీర్ఘసమాసములను "అఖిలజలధి వేలావలయితంబు" ఇత్యాదులను వాడుకొనియు, నాతని వలెనే తిక్కనకంటె నెక్కువపాలుగా సంస్కృతపదములను గలిపి తత్సమబహుళంబగు భాషలో రచించియు—తద్రచనయని స్థూలదృష్టితోఁ జదివినవా రనుకొనునట్లు చేసినను, తిక్కనార్యుని భారతమును విశేషమగు శ్రద్ధతో, సత్యంతాదరముతో, విమర్శనా దృష్టితోఁ జదివికొని యాతని కవితావిశేషలక్షణములను గుర్తించి యున్నవాఁడగుటచే, నన్నయ రచించినట్లే రచింపవలెనని మొదలుపెట్టి, యట్లే రచించితినని తలంచి, పైకి వ్యక్తము చేసినను తిక్కనార్యుని కవితాప్రభావ మీతనికిఁ దెలియకుండఁగనే యీతని కవితలోఁ బ్రవేశించి, యీతని కవితను నన్నయ కవితనుండి వేఱుపఱుచుచునే యున్నది. ఇట్లాంధ్రవాఙ్మయమున సుప్రసిద్ధులై ప్రమాణ కవులగు కవిత్రయము వారిలో మూఁడవవాఁడగు నీయెఱ్ఱాప్రెగ్గడ కవితారచనయందు మొదటి యిద్దఱుకవులయొక్క విశేషలక్షణములే యొక్కచోఁ గలిసి యతి హృద్యంబగు సమ్మేళనమును బొంది యాతని కవిత కసమానంబగు రామణీయకత నాపాదించినవి. షేక్స్పియర్ మహాకవినిగూర్చి డ్రైడెన్ చెప్పినట్లుగా* నన్నయ తిక్కనల యంశములే గలిసి యీతనియందుఁ గానవచ్చుచున్నవి.

---

* *The force of Nature could no further go*
*To make a third, she joined the other two-*

జాఁగినశాఖ లాశాచక్రముల కొలం
దులు బారవెట్టంగఁ బొలుచుదానిఁ
గవటలొండొంటితోఁ గదియుచు నెడములు
గ్రమింగి గ్రప్పఁగ సొంపు మిగులుదాని
లోనిజొంపము పవలును బెనుఁజీకటి
నొదవించి పొదలంగ నొప్పుదానిఁ
గనియెఁ బవమాన వివిధవర్తన కళా ని
వర్తిఁగాక మూకారవస్ఫూర్తి జాత
భీతి పరిసరవర్తి నాభీల భుజగ
చండమూర్తి శమీతరు చక్రవర్తి."

మొదటి నాలుగు పాదములలోఁ జిన్నచిన్న యచ్చ తెనుఁగు పదములలో వాని స్వరూపముఁ జక్కఁగా వర్ణించి, తుది గీతములో దాని భయంకరాకారమును నొక పెద్ద సంస్కృత సమాసములో భీకరముగా వర్ణించుట పై రెండు పద్యములకు సమానము. నెడ లెల్ల గ్రమింగుట, ఆశాచక్రముల కొలందులు బారవెట్టుట అను సమానభావములువాడ నెఱన తిక్కన ననుకరించుటను వ్యక్తముచేయును. ఇట్టి సందర్భముల నన్నయశైలి కేవల సంస్కృత జటిలంబై మహోదధిగాంభీర్యమునే తలపించుచుండును

"అలఘు ఫణీంద్రలోక కుహరాంతర దీప్తి మణిస్ఫురత్ప్రభా
వలిగలదాని, శశ్వదుపవాసమహావ్రతశీతపీడితా
చలమునిసౌఖ్య హేతు విలసద్బడబాగ్ని శిఖాచయంబులన్
వెలిఁగెడుదానిఁ గాంచి రరవిందనిభానన లమ్మహోదధిన్."

అరణ్యపర్వశేషములోఁ గొన్నిపట్ల సంభాషణశైలి తిక్కన సంభాషణశైలినిబోలి సయుక్తికంబై, జాతీయయుక్తంబై, నన్నయ రచనకంటె రమ్యతరముగాఁ గనఁబడును. అరణ్యపర్వము 4-ఆశ్వాసము

చ్చెర సంస్తంభం నొందుచు
నరనాథుఁడు విస్మయావనత మానసుఁడై."

"పల్లవుడి చలముగోపము
పొల్లవడి చనంగఁ గొంత ప్రొద్దు మొగము నస్
వెల్లఁదనము గదురనిలిచి
యెల్ల జనులు వినఁగ మఱియు నిట్లని పలికెన్."

అడితిఁ బెక్కుమాట లవియన్నియు వమ్మయిపోయె నస్త్రసం
తాడన శక్తి గిడ్డపడియెఁ దథ్యము బ్రాహ్మణశక్తి యెక్కుఁ డే
నోడుదు వాసుదేవునకు నో జననంథములార సజ్జనా
మేదితకీర్తి నిమ్ముని నమిత్రనిషూదను నాశ్రయించెదన్."

పై పద్యములలో స్తంభము నొందిన నరనాథుని విస్మయావనత మనస్కత్వము, నాసమయమునందలి యాతని మనోవృత్తుల యందలి క్రమపరిణామము (*gradual development*) వానికిని బాహ్యాకారమునకును గల పొందిక యెంత చక్కఁగా వర్ణింపఁబడియున్నదో చూడుఁడు. ఇట్టి వర్ణనలు తిక్కన సొమ్ము. నన్నయభాగమున నిట్టి మనోవృత్తుల వివరణము గానరాదు. ఎఱ్ఱాప్రెగ్గడ తిక్కన ననుసరించి రచించెననుటలో సందేహము లేదు. తుదిపద్యములోని యాతని పలుకులెంతయు రమ్యములై సందర్భానుకూలములై నాటకగుణము కలవై యున్నవి. (*Speech how dramatic!*)

అరణ్యపర్వ మైదవయాశ్వాసమున నింద్రుఁడు మహాపస్వామితోఁ బలికిన యీ క్రిందిపద్యమునందలి రచనావైఖరి విరాటపర్వములోని యుత్తరుని వాక్యములతోఁ బోల్పఁదగియున్నది :

"అనునెడ నింద్రుఁడిట్లనియె నట్లయినం గడులెస్స దేవ నీ
యనిమిష నాయకత్వమునయం దభిషిక్తుఁడవై ముదంబుతో

*descriptions or description of mental atttitudes and conflicts)* నాటకాభినయమును సూచించునట్టియు వర్ణనలనత్యద్భుతముగాఁ జేయుట లోని ప్రాగల్భ్య మొక్క తిక్కనకే చెల్లినది. తిక్కన సముపరించి, యాతఁడసమాన చాతుర్యముతో చిత్రించిన ద్రౌపదీ పాత్రము యొక్క తత్వమును బాగుగాఁ దెలిసికొనినవాఁడు గనుకనే యెఱ్ఱాప్రెగడ యా సంవాదమును తిక్కనవలె రచింపఁగలిగినాఁడు. నన్నయయే యైనచో నిట్లు రచింపలేకపోయియుండును. అప్పుడు ద్రౌపది యేమిపలికినదో ఆ పలుకులు తిక్కన చిత్రించిన యామె స్వభావమున కెంత తగియున్నదో పరికింపుఁడు:

"నను నిట్లు దుష్టవనితా
జనము నటులుగాఁ దలంపఁ జనునే నీకుఁ
మనసొప్పదు పురుషోత్తమ
వనితవు గాఁదగవు నీవు వనరుహనయనా.

"అని మేలంపుఁజంపంబున దాని వివేకహీనత మెఱుఁగుపఱచి పాంచాలి మఱియు నిట్లనియె."

ఈ మేలంపు జంపంబునఁ నతి గంభీరముగా తిట్టినట్లు గాకుండ, పొగడినట్లు గాకుండ నతి గడుసుదనముతోఁ బలికించుట తిక్కన వైఖరియే గాని నన్నయది కాదు. అట్లు తాను పతులయెడలఁ బ్రవర్తించు రీతినంతను వివరముగాఁ జెప్పి తుదకు

"ఇట్టి వర్తనముల నెపుడుఁ బాండవులకుఁ
దగిలి ప్రియము సేయఁదగితిఁ గాని
మగువ నీవు చెప్పు మందులు మాయలు
నింద్రజాలములును నే నెఱుంగ."

అని యన్నది. ఈ వాక్యములలోని జాతీయము, భాషాశక్తి *(Force of language)*, జిగి యెట్టిదో పరికింపుడు.

మహాకవి రచించిన ద్రౌపదిపాత్రమును గమనించి యాతఁడు సూచించిన రీతి భావచ్ఛాయలను గనుఁగొనుచు, నాపాత్రము నభినయించినచో నది రమ్యముగ నుండఁగలదని తోఁచుచున్నది. పై సత్యభామతోడి సంవాద సందర్భమును రచించుటలో నెఱ్ఱాప్రెగ్గడ యీ తిక్కన ననుసరించెననుటలో సందేహములేదు.

తగిన సందర్భము దొరికినను నన్నయమహాకవి మనోవృత్తులం బట్టింపక కథాగమనికయందు మాత్రమే గౌరవమును జూపి విడిచివేసిన ఘట్టములనొకటి రెంటింటిని జూపెదను. మనమునఁ బొడము విరుద్ధభావముల సంఘర్షణమును జూపి తాత్కాలిక మనోప్రవృత్తులను జక్కఁగా వివరించుట కనువగు సందర్భ మొకటి యారణ్యపర్వమునఁ బ్రథమాశ్వాసమున నర్జునుఁడు పాశుపతాస్త్ర సంపాదనకై తపంబు సేయఁబోవునం దొకటి తటస్థించినది. అర్జునుని యస్త్రసంపాదనోద్యోగమునకు సంతసము, తాత్కాలికమగు వియోగమునకు దుఃఖము పట్టు వారివారి మనోవృత్తులను ద్రిప్పినచో చూపుట కవకాశము కలదు. కాని నన్నయ యెట్లు రచించినాఁడో చూతుఁము.

"దివ్యాస్త్రలాభార్థంబుగా నగ్రజుచే సముజ్ఞాతుండై విధి హోమ సంతర్పిత వీతిహోత్రుండును, బ్రాహ్మణకృత స్వస్త్యయనుండునునై ధౌమ్యాది మహీసురవరులను, భ్రాతృవరులను వీడ్కొని తపంబున కరుగ సమకట్టిన............ అతని గాండీవ హస్తు నక్షయ బాణతూణీర యుగళు నుత్తుంగభుజునిఁ జూచి పొంగి యంతర్హిత భూతములును, బ్రాహ్మణప్రవరులుఁ బార్థుని మనమునఁ దలఁచిన యర్థంబు దదయ శీఘ్ర సంసిద్ధి యయ్యెడు, సర్వవిఘ్నములు శాంతిఁ బొందెడుమని సంతసంబున బల్కిరి."

అర్జునుఁ డేఁగునపుడు సోదరులొక్క మాటయైనను పలుకలేదు. అతఁడు తలపెట్టిన యుద్యమమునకు సంతోషముగాని, వియోగమునకుఁ బరితాపముగాని యేమియు వెలిఁబుచ్చియుండలేదు. జాగరూకుఁడవై తపంబు సలుపుమని హెచ్చరింపనైన లేదు. అతనిఁ జూచి పొంగి పలికి

నది అంతర్విఘాతములును, బ్రాహ్మణప్రవరులును మాత్రమే. ఇట్లు వైదిక కర్మలను గూర్చియు, వైదికాచారములఁ గూర్చియు వర్ణింపఁ వలసిన పట్ల నన్నయభట్టు చూపెడు జాగరూకత, ఉత్సాహము ముఖ్యముగా గమనింపఁదగి యున్నది. ఇట్లు భూసురులు, బ్రాహ్మణులు పలికిన పిదప,

> "... అంతఁ దరుణి పాంచాలి సుభక్తి
> కడకు నమస్కరించి కమలనేత్ర
> అరిజయాప్తి మునుగు నాతని యుత్సాహ
> మెఱిఁగి యిట్టు లనియె నిందువదన."

అంతేగాని యిచ్చట ద్రౌపదీమనోవృత్తులనైనను సూచించినాఁడు కాఁడు నన్నయ.

> "అవమానాసహ మగునీ
> యవనిక్షత్రియకులంబు నందిం బుట్టఁ
> బుట్టు గాంచెదు తత్క్షమ
> మును బ్రాహ్మణకులమునందు యమ్యము నాకున్."

> "అరికృత దుష్పరాభవమహార్ణవమగ్నుల మమ్ము నందఱం
> గరుణ సముద్ధరింపుము జగన్నుత యన్యులు పూనఁగాని యీ
> భరము సహింపఁ జాలిన యపారగుణాన్వితు నిన్ను
> దిక్కులన్
> ధరణియు సోముఁడున్ నభము ధాత్రియు గాడ్పును గాచు
> చుండెడున్."

అని యొక దీవన మాత్రమిచ్చి యాపాంచాలరాజపుత్రి తన స్నేహలాలసవిలోలాపాంగవిలోకనంబులం దాడఁ బరిగృహీతపాథేయుం జేసి తద్వియోగకాతరంబైన హృదయం బెట్టకేనియు నొక్కింత దిట్టచేసికొని

యుండెను, అని నన్నయ యుచితంబుగనే చెప్పినాఁడు కాని తిక్కన యైనచో నీ సందర్భమున నామె హృదయము వియోగతిమిరంబెట్టి దదియు, దాని నామె యెట్టకేనియు నెట్లొక్కింత దిటచేసికొనియుండె నదియు విపులముగా వర్ణించి, యప్పటి యామె స్వరూపమును మాటలచే చిత్రించి మన కనులయెదుటఁ బెట్టియుండెడివాఁడు. నన్నయకు కథ నడు గుటయే గావలసినదిగాని యీ కావ్యకళాసౌందర్యమును సంపాదించు విషయమున విశేషాదరము, తత్పరతయు లేదు. ఆదని దృష్టిభేద మేలు. తిక్కనార్యుని దృష్టిపథము వేరు. ఎఱ్ఱాప్రెగ్గడయు నీ విషయ మునఁ దిక్కననే యెక్కుడుగా ననుసరించినాఁడనుట స్పష్టము.

మఱియొక సందర్భమును గమనింతము: ద్రౌపది సౌగంధిక ప్రసూనంబులం దెచ్చి యిమ్మని భీమునడుగుట

"గంధమాదన పుణ్యతీర్థావలోకనపరులయి పాండవులు ధౌమ్య లోమశ ప్రభృతి కతిపయబ్రాహ్మణులతోఁ జని యక్షపతిసంబంధ

"విమలస్ఫాటిక హాటక
రమణీయదరీనిరంతర శ్వేతనగేం
ద్రము మాల్యవంతమును ను
త్తమ చరితులు సూచు చరిగి తద్విపినమునన్."

"చలదళిశుకపుంస్కోకిల
కలరవముఖరితలతాంత ద్రుమఫలాళీ
లలితమహీరుహమాలా
మిళితోద్దేశముల విశ్రమించుచు లీలన్."

తిక్కని మృదుమధురపద గుంఫితములగు సంస్కృత సమాసము లతో ధారాళములు, సరళములునగు విచిత్రంపు నడకలతోఁ గూడిన వర్ణనానైపుణ్యమును జెప్పవలసి వచ్చినపుడది నన్నపార్యుని సొమ్మని చెప్పవలసినదే. అతిమృదులంబగు పూలపాన్పుపైఁ బండుకొనఁబెట్టి జోకొట్టినట్లేయుండును.

ణేంద్రియ సాహాయ్యముననే, మన కనుల యెదుట నాటకమాడించుశక్తి తిక్కనార్యునికే గలదు.

సభాపర్వమున ద్రౌపది సభకుఁ దోడ్కొని రాఁబడినపుడైనను, ఆమె మనోవృత్తులను, నాకారేంగితములను నన్నయ యేమియు వర్ణించి చూపలేదు. కేవలము కథ చెప్పినట్లున్నదే గాని యాదృశ్యము మనమనో దృష్టి నాకర్షించుట లేదు.

"దుర్యోధనుఁడు దుశ్శాసనుం బిలిచి ప్రాతికామి వృకోదరునకు వెఱచు, నీవు వోయి ద్రౌపదిం దోడ్కొని రమ్మని పనిచిన,

> "నిర్దయాత్ముఁ బాపనిరతు దుశ్శాసనుఁ
> బనుచు వెఱఁగి కృష్ణ పంకజాక్షి
> గడు భయంబునొంది గాంధారి యొద్దకు
> నరిగెఁ గడు వడంకి యతిరయమున."

కడు భయము నొంది, వడంకి గాంధారి యొద్దకు నరిగె నని మాత్రము చెప్పినాఁడు నన్నయ. అక్కడి కది స్వాభావికంబై రమ్యంబుగనే యున్నది. కాని భారతకథ కంతకును ఆయువుపట్టువంటి యీ ద్రౌపదీమానభంగ కథాసందర్భ రచన తిక్కన చేతులలోఁబడి యున్నచో నెంత రమ్యతరంబుగాఁ జేసి మన కనులయెదుటఁ బెట్టె వాఁడో యనిమాత్ర మనిపించును. ద్రౌపదిం బట్టుకొనుటకుఁగా కీచకుఁడు వెనుకఁ దగిలినప్పటి కథా సందర్భమున తిక్కన యెట్టి చాతుర్యమును జూపినాఁడో పరికింపుఁడు. వెంటఁ దగిలివానిని మరలిచూచుట— భయభ్రాంతయగుట— ఇదియంతయుఁ జూచిన భీముని కోపాటోపము— ధర్మజుఁడు వారించినవిధము— ఈ యన్నదమ్ముల చేష్టితములఁ జూచుచు మెల్లన లేచి యెంతయు దైన్యముతో విరటుసభ కేఁగుట— అప్పటనెలుంగు చలింపఁ బలికినరీతి— భీముని కోపాటోపము— ద్రౌపది దైన్యస్థితి ... యివి యన్నియు నా కథాసందర్భము నంతనుఁ గన్నులకుఁ గట్టినట్లు చేయును. అజ్ఞాతవాసమున నున్నపుడే వారిస్థితి యిట్లు తిక్కన వర్ణించి

చూపినాఁడు. అంతరంగ భయసంభ్రమములను రోషదైన్యములను బహి ర్గతములఁ జేయఁగలిగిన యీ సందర్భమేదో మానసరథ విన్నట్లై యున్నది గాని యది ప్రత్యక్షమై యెదుటఁ గనబడిన ట్లుండకుండుటకు కారణంబసలో నన్నెచోడుని వ్యక్తిత్వము వేఱుగానే కారణముగాని వేఱు కాదు.

మనోగత భావవికారములను వెలిఁబుచ్చు సూచనలు చేయుట నన్నయ రచనాశక్తి మైనట్లు కనఁబడదు. కథాభాగమును వట్టి కథచెప్పి నట్లుగనే (*narration*) నడిపింపక, యందలి పాత్రల సంభాషణాదికము మాటలయందును, ఆ మాటలాడు సమయముల వారివారి మనోగతి భావము లను వెలిఁబుచ్చుచున్నట్లు సూచించుచుండుట చేతను తిక్కనరచన నాటకి లక్షణములు కలదగుచున్నది. ఇట్టి లక్షణము లరణ్యపర్వశేషమునఁ గాన వచ్చుచుండుటచే నిది తిక్కన ననుసరించి యెఱ్ఱాప్రెగడ రచించినదే యని చెప్పఁదగును. నన్నయ్య కిట్టి పద్ధతుల యందు నాదరము లేకుండె ననుట కీ క్రింది నిదర్శనమే చాలును:

పాండవుల విషయములనుగూర్చి విని ధృతరాష్ట్రుఁడు దుఃఖించుట. ఇది ఆదిపర్వము 6-వ యాశ్వాసమున వచ్చును. పాండవులు లక్క యింటఁ బడి చచ్చిరనియు, నిట్టి దారుణంబగు కృత్యంబునకుఁ గారణము దుర్యోధనుని కృత్యంబనియు నెఱంగి, వారణావతమ్మున వారెల్ల శోకించి కుంతీ పాండవుల పంచత్వంబు ధృతరాష్ట్రునకుఁ జెప్ప నేతెంచిన,

"బాధితశత్రుపక్షు లగుపాండుకుమారుల దుఃఖవార్త మ
ర్యాదము లైన భీష్మవిదురాదిసమంతులయొద్ద నప్పుడు
ర్యోధనుఁడాది గాఁగ సుతులున్న సభన్ విని దుఃఖితాత్ముఁడై
యా ధృతరాష్ట్రుఁ డావ లఱచిన ట్లఱచెన్ వివిధప్రలాపుఁడై."

ఇట్లు పాండవుల మరణవార్త విని దుఃఖితాత్ముఁడై యావ లఱచిన ట్లఱచె నని యొక యుపమానముతో నా ధృతరాష్ట్రుని దుఃఖ మిట్టిదని తెలిపినాఁడు నన్నయ. ఈ యుపమానమును విశేషభావగర్భితమును, నీతని దుఃఖమును చక్కఁగ వ్యక్తము చేయునది కావచ్చును. కాని తిక్క-

నాదు రచనలోని నాటకకళారీతి (*dramatic element*), కళా సౌంద ర్యము (*artistic beauty*) ఇందుకలదని మాత్రము చెప్పుట కవకాశము లేదు.

మఱియు గాంధారిం దొట్టిదేవీ జనుల యాక్రందన ధ్వని యంతః పురంబున నెగసె. భీష్మాదికురువృద్ధులును విప్రులుం బౌరులును శోకా క్రాంతులైరి. విదురుండు పాండవుల కుశలగమనం బెఱింగియు నెఱుం గనివాని పోలె నందఱం గలిసి దుఃఖితుండయనట్లుండె. అంత ధృత రాష్ట్రుండు గొడుకులుం దానును గుంతీపాండవుల కుదకదానంబు సేసి యగ్నిసంస్కారాది పరలోకక్రియలు సేయింప గంగాతీరమునకుం బనిచి వారి బ్రాహ్మణుల నపారధనంబులతోడం బుచ్చిన"

అనియుం జెప్పఁబడియున్నది.

ఈ సందర్భమున సంస్కృత మూలమునకు నన్నయ తెలుఁగు నకుఁ గూడ కొంత భేదము కనఁబడుచున్నది, కుంభఘోణపు సంస్కృత ముద్రిత ప్రతిలో పాండవుల నాశనమును గూర్చి విన్న పిదప వారందఱు అందు ముఖ్యముగా భీష్ముని విలాపము ఇరువది శ్లోకములలోఁ జెప్పఁబడి యున్నది. అతఁడు పాండవుల గుణవర్ణనము చేయుచు, దైవగతిని చింతించుచు విశేషముగ వాపోవుచుండ తుదకు విదురుఁడు పాండవులఁ గూర్చిన నిజమైన వార్తను భీష్మునికిఁ దెల్పి యాతని నూరడించుటయే గాక వారికుదక దానమును గూడ జేయవలదని చెప్పినట్లు కనఁబడు చున్నది. సంస్కృత మూలములో నీ భాగము ప్రక్షిప్తమై యాతని కాల మున నాతఁడు గ్రహించిన ప్రతిలో లేకుండెనని నిశ్చయింప గలిగిన నేమోగాని, లేనిచో, నన్నయ మూలములో భీష్మాదుల విలాపమునంతను "శోకాక్రాంతులై" యను మాటతో నెగురగొట్టివేయుటను జూడఁగా నాతనికి రసోచితముగా నీమానసికప్రవృత్తివర్ణనమును జేయుటయం దంత శ్రద్ధ, యుత్సాహము లేవని తలంపవలసివచ్చుచున్నది. మూలమునకలు న్నను సందర్భము దొరకినచోఁ దాను స్వయముగ నాయాపాత్రల మనో

"నా చేసికీడునఁ గడు
నీచుండగు నా తనూజు నేరమి నిమ్మె
నోచెల్ల పార్థులకుఁ బ
ఱ్యాచారుల కెందులేని ఆపదవచ్చెన్."

"అన్నయుఁ దమ్ములున్ సతియు నార్తిమెయిం బహుదుఃఖ మగ్నులై
యున్న తెఱంగు సూచి విజయుండు యుధిష్ఠిర వాక్యబద్ధుడై
సన్నుతుఁ డుగ్రపన్నగము చాడ్పున రోఁజుచుఁ గ్రోధశోకవే
గోన్నతి నాత్మ నే మనుచునుండునొ నాసుతుతప్పు సెప్పుచున్."

"అనుపమతేజుఁ డున్నతభుజాగ్రుఁ డుదగ్రుఁడు వైరినిగ్రహాం
డనఘుఁడు వాయుసూనుఁడు నిజాగ్రజు చేసినసత్యపాశబం
ధనమునఁ జిక్కి తత్సమయతత్పరుఁడై యట ఘోరదుఃఖవే
దనములు సైఁపగాని మది దద్దయుఁ గ్రోధముయింబు వానికిన్."

"శకునికైతవము దుశ్శాసనుచేసిన
దుష్కర్మమును గర్ణు తులువతనము
దుర్యోధనునిదైన దుర్ణయంబును జిత్త
మునఁ గిరిశల్యముల్ వోలె నలఁప
దావాగ్ని తెఱఁగున దఱికొని క్రోధంబు
వనవాస మనియెడి వాయుగతుల
నంతకంతకుఁ బేర్చి యవయవంబులనెల్ల
మండగ నెప్పుడు మధ్యముండు
మొగము జేవురింప ముడివడు బొమలతో
నపుడు గఱచుచును భయంకరముగ

సున్నరూపు వాయుసుతుండు నాఁడిది వాఁడ
మిత్తి నాదుపుత్రమిత్త్రతతికి."

"అస్త్రజానిల ప్రేరితం బగుచుఁ బెచ్చి
వాయుతనయదవాగ్ని దుర్వారభంగిఁ
గర్ణ సౌబలసహితముగా మదీయ
పుత్రశతకాననము నెల్లఁ బొడువడంచె."

ఇట్లు పాండవుల వనవాసక్లేశమునఁ దైన తన దుఃఖమునెగాక, వారివారి స్వభావములను, వారివలనఁ దనకు గలుగు భయము చక్కఁగా వ్యక్తము చేసినాఁడు. భీముని స్వభావ మతిరమ్యముగా, సందర్భానుసారముగా వర్ణింపఁజేసినాఁడు. ఎఱ్ఱాప్రెగ్గడ తిక్కనరీతుల ననుసరించినవాఁడు గనుకనే యిచ్చట నీ దుఃఖవర్ణన నింతగా పెంచినాఁడు.

వైదికోత్తముఁడగు నన్నయ ధోరణితో నతుకక రసోచితముగు తరువాతి ప్రబంధకవుల ధోరణికి మార్గదర్శకంబులైన గడుసుపోకడ లీ యరణ్యపర్వశేషమున నచ్చటచ్చటఁ గలవు. పరీక్షితుఁడను రాజొకఁడు మృగయారతుండై పోయి వనంబున నొక పువ్వుఁబోఁడిం గనియె.

"కని యంతఁ గదిసి యా కా
మిని యొప్పులఁ జూచికొఁ దగుఁ మీఱినతమకం
బున ననిమిషలోచనుఁడై
జననాథుఁడు మదనబాణసంహతిఁ దూలెన్."

"అదియు నతిసుందరంబైన తదీయ మూర్తివిభవంబునకు మెచ్చి సాభిప్రాయంబుగా నవలోకించె నంత నమ్మహీకాంతుం డక్కాంత కిట్లనియె.

"ఎవ్వరిదాన వంబుజదళేక్షణ యేకతమిట్లు లేల నీ
విప్పనభూమియందుఁ జరియించెదు నాపుడుఁ జంద్రబింబవదనం

దివ్వనభూమియందుఁ జరియించెద సద్వరగోపకన్య నే
నెవ్వరిదానఁ గావలయు నేర్పడ జెప్పుము రాజనందనా.

"అనిన దాని ప్రగల్భవచనంబులకు నధికవిలోలుండై భూపాలుండు దన యభిలాషం బెఱింగించిన."

పై ప్రగల్భవచనముల ఛాయలే ప్రబంధరాజంబగు మనుచరిత్ర లోని

"ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిజరించె దోఁట లే
కివ్వనభూమి........"

అను పద్యములో పెద్దనార్యునిచే ననుకరింపఁబడినవి. మార్కండేయుండు ధర్మజునకు బ్రాహ్మణప్రభావంబుఁ జెప్పుట యను ఘట్టములోని వీ పద్యములు. ఇది నన్నయయే వ్రాసినచో నిట్టి ప్రగల్భవచనములతోఁ గాక ధర్మయుతములు, వైదికాచారబోధకములునైన వాక్యములతోఁ గూడి యుండెడిదేమో యీ ఘట్టము. ఇదియంతయు కేవల కథాకథన పద్ధతిని *(narrative style)* గాక సంభాషణాశైలిలో రచింపఁబడిన దగుటచే తిక్కనార్యుని శైలి ననుసరించిన యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వమనుటకు సందేహములేదు.

యుద్ధవర్ణనా విషయమునను నీ యారణ్యపర్వశేషము తిక్కన రచనల ననుసరించునదై యున్నది. "తండ్రిచే వీడ్కొలుపఁబడిన యింద్రజిత్తు సత్వరుండై యరదంబెక్కి పురంబు వెలువడి కరతలంబెత్తి లక్ష్మణునిం బిలుచుట" "మచ్చరముమీఱ నొండొరుఁ జిచ్చులపిడుగులను బోని శితవిశిఖములం జెచ్చెరనొంచుట", నెఱకులు నొంచి బాణమయ నీరధి ముంచుట, శరములుచ్చిపోరుట, అట్లుదలపడి యవ్వీరులిరువురు సాభీల శార్దూల యుగళంబు కరణి నతిఘోర యుద్ధంబు సేయుచుండ నిశాచరవనచరబలంబులురణంబుడిగి వెఱఁగుపడి వారిపోటుసూచుచుండుట.

తక్కిన సామాన్య యుద్ధక్రమ వర్ణనము, నివియన్నియు తిక్కన రచనల

బహుపుష్ప పల్లవ ప్రకరచిత్రితములై
తనరారు తరులతాతతులసొంపు
మకరందరసపాన మదవిలోలంబులై
క్రాలెడి యెలదేటిగములయులివు
పరిపక్వమంజులఫలరసోద్ధతములై
పలుకు రాచిలుకల పటురవంబు

ప్రియుడు వేఱువేఱ ప్రీతిమై జూపుచు
చెప్పుచును జనంగ జిగురుబోడి
గనుచు వినుచు నిర్వికార సల్లాపంబు
లార నతని తెఱగు నరయుచుండె.

ఆరణ్య. 7 ఆ. 218 ప.

ఆరణ్యపర్వశేషమునందలి కొన్ని పద్యములకును తిక్కనార్యుని పద్యములకును గలపోలికలు :

"ఇట్లు వైశ్వానరుండు మునిపత్నులయందు దగిలిన డెందంబు మగిడింపనేరక వారలం గదియ నప్పళించి గార్హపత్యకుండంబునం దావేశించి,

"అతివలు దన్నుజేరుటకు నాసపడుం బోరి జేరిచోట నా
యత విలసచ్ఛిఖాగ్రముల నల్లన వారల నంటు గౌతుకం
బతిశయమై తరంగలత లాదట గౌగిట జేర్పగోరు కం
పిత ధృతియై కలంగబడు బెల్లగు రాగరసంబు ముంపగాన్."

విరాట పర్వమున గీచకుడు ద్రౌపదిని జూచి

"అనియని యుగ్గడించు ధృతి యల్లలనాడిన దల్లడించు బై
కొను తలపోరగించు మది గోర్కులు పేర్చిన నప్పళించు నె

ట్టన తెగ నగ్గలించుచు, నపటుఁగా జనులఁగా బరికించు, బుద్ధిమా
లినపెన నెంతయుం గళవళించు మనోజవికారపరగ్నుఁడై :"

విరాట. 2.82

"ఆయతబాహు లుగ్రబలు లాఢ్యులు పార్థులు వారిభూరిశౌ
ర్యాయుధులై పుణ్యక్రియలయందు పదాలఁపపాలుఁ బోలఁ డీ
నాయపదర్థులాఁ దధిప వారల బందమునీనిబందమున్
నీయెడ నిర్లజ్జుఁడై తెలిపెనే ఖచరేంద్రులపోరిలోపలన్."

అర. 3.83

"ఒకటనైనను వారియం దొక్కఁడైన
చిదురపాలను బోలందు సిగ్గు లేక
పాండవుల గెల్తు నేనని పలుకుచుండు
పినిరజ్జులు దులుపలు వింద్రు తగిరి."

ఉద్యో. 2.169.

సైంధవు పంపున గోటికాస్యుండు ద్రౌపదిని సంబోధించుట:

"పొలతి నీదు, టీపితోక్క్పుఁడగు సుఖజీవితాభ్యుఁ
దెవ్వఁ డతల వీ నాపుమై యుంపు బుగులు
కద్ద మెయ్యది నాకు నిజంబు చెపుమ."

అరణ్య. 6.161

కీచకుఁడు ద్రౌపదిని గూర్చి–

"దివిజన్మంబునఁ దేజంబు నొందిన
యింతియుఁ బతియును నెవ్వరో కా
దివినామాకృతి గా నోచిఁ పగసిన
యింపగువర్ణంబు లెవ్వియొకా...."

విరా. 2.80

సీత రామునితో—

"పడఁతి మెల్లన మఱికొంతపడికిఁ దెలిసి
యలసమూర్తియై కనుదోయ నశ్రు లురలఁ
గేలు ముకుళించి వసుమతీపాలుఁ జూచి
ఎలుఁగు కుత్తుకఁ దగులంగ నిట్లు లనియె."

అరణ్య. [illegible]150.

అర్జునుఁ డభిమన్యువధానంతరము దుఃఖించుట:

"అని యలంతమైఁ బలుమాట లాడుచుండి
తలఁచి మఱియును ధర్మనందనుని యాన
నంబు వీక్షించి నిర్జరనాథతనయుఁ
డెలుఁగుకుత్తుకఁదగులంగ నిట్టులనియె."

ద్రోణ [illegible]

సావిత్ర్యుపాఖ్యానము—సావిత్రి తండ్రియొద్దకు వచ్చుట:

"నెచ్చెలులు దన్నుఁ గొలువగఁ
బచ్చవిలుతుకలిమి యెల్లఁ బ్రత్యాసన్నై
యచ్చుపడినట్లు మెఱయుచు
నచ్చటి కేతెంచె భూవరాత్మజ నెమ్మిన్."

ఇట్లు వచ్చి సఖీజనంబుల నంతంత నిలిపి మెలపుతోడి పొలుపున నయ్యగుప లీలామధురంబుగఁ దండ్రికి దండప్రణామంబు సేసిన నాతఁడు పుత్త్రిన్ బ్రెగ్గుచ్చియెత్తి నిజాంకతలంబున నునిచికొని సముచితోపలాలనసక్తీవర వశుం డయ్యె."

అరణ్య. 7-128.

బరిణతములగు సుందరకరివరముల
వలసినను చారులావణ్యవతుల వలసి
నను మహాగ్రామములు వలసినను గోర్కి
కెక్కు డమ్మేటిమగని కే నిచ్చువాఁడ"

కర్ణ. 2-30.

తిక్కనార్యుడు చేసిన జాతీయప్రయోగములు కొన్ని యారణ్యపర్వ శేషమునఁ గానవచ్చుచున్నవి. ఇవి నన్నయభాగమునఁ గానవచ్చుటలేదు.

"రాధేయుం డొకచీటికిం గొనఁడు దేవవ్రాతముం బోటులన్."

విరా. 4-ల

"కమలవరప్రదత్తవరగర్వితుఁడై మముఁ జీటికిం గొనం
డమితపరాక్రముండు దనుజాధిపుఁడీతఁడు.

అరణ్య. 5-288.

"ఆతూపు దప్పిన గాసియైతి."

శల్య.

"ఇవ్విధంబున నతం డేటుతప్పిన జోహారువెట్టుటయు."

అర. 4-362.

"ఈ దేవదేవు కరుణం
గాదే కురునాథ నిర్వికారుఁడనై ని
ఖేదుడనై యుంటుదు."

అరణ్య. 4-284

"కాదేని గాండివ జ్యా
నాదము సురదుందుభి ప్రణాదంబును నిః

విశారదుండు—నన్నయ భట్టోపరింప తాను విరాటపర్వమట యుద్యోగా
దులం గూడఁగా పదునేనింటిని "తుదిముట్టఁ దెనుఁగున రచియించు
వాఁడ్ల"నని తెలుఁగున భారత మీ దేపర్వములతోఁ ముగియుననియే
స్పష్టముగాఁ జెప్పి, తన రచనతో భారతము సంపూర్ణమగు నని యెంచు
టయే గాని యాంధ్రభారతరచన యింతను కొఱవడియుండునని యాతఁడు
తలంచిన ట్లగపడకపోవుటచేతను, నాతని కాలమునను మూఁడుపర్వములు
సంపూర్ణముగా నున్నవనిగాని, లేదా నన్నయభాగము నాతఁడు చూచియే
రచించెననిగాని చెప్పక తప్పకున్నది. నన్నయభాగములోని కొన్ని పద్య
ములను మాత్ర మాతఁడు వినియుండవచ్చును. మూఁడవపర్వములోని
భాగము కొఱవడియున్నఁగాని, అట్లున్నదని యాతఁ డెఱింగియున్నఁగాని
తుదిముట్టింతునని చెప్పియు, దరువాతనైన నా శేషమును బూరింపకపోఁ
గొనకుండునా. ఈ తుదిముట్టింతు నన్నది 15 పర్వములే యని చెప్పుదు
రేమో, అదియు పొసఁగదు. ఈ పద్యములలోని క్రియలకు ప్రధానకర్త
పై పద్యములోని "భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయము" అను
నది "ఆదిమును" అని యాభారతగ్రంథమునే యనువదించి, అందులో
18 పర్వములున్నవి. అందు మూఁడు కృతులు నన్నయ రచించెను.
తిక్కన 15ను రచించి తాను తుదిముట్టింతునని స్పష్టముగాఁ జెప్పి
యున్నాఁడు. కావున తిక్కన తరువాత నలుబది యేబదేండ్లలో నీ
భాగము శిథిలమైపోయిన దనుటకంటె తిక్కన యీ పర్వములను జూచి
లేదనుటయే యుక్తముగా గనఁబడుచున్నది.

నన్నయ రచించిన భారతమును తిక్కనాచార్యుఁడు చూచినను జూచి
కున్నను, మొత్తముమీఁద నాతఁడు ప్రారంభించిన భారతాంధ్రీకరణోద్య
మమును కొనసాగించి తుదముట్టింపవలయునని మాత్ర మీతనికి దృఢ
సంకల్పము గలిగినది. మొదటి మూఁడుపర్వములు రాజమహేంద్రవర
రాజ్యాస్థానకవి యాంధ్రకవిత్వ విశారదుం డొనర్చెనని విన్నాఁడు. ఈ
పర్వములు ముఖ్యముగా ఆది యారణ్యపర్వములు విశేషముగనుపాఖ్యాన
ములతోఁ గూడి యున్నవి. పాండవులను గూర్చినకథ స్వల్పమే. ఈ

జేసియే, నన్నయ రచితంబగు మొదటిభాగమును గూర్చి జనులలోఁ గౌతూహలము పెరుఁగుటయు, నదియుఁ బైకి దీయఁబడి ప్రచారములో నికి వచ్చుటయు దటస్థించియుండును. తిక్కనకు సమకాలికులు, గొంకెము తరువాతివారునగు కేతన, మంచన, మారనలు నన్నయభట్టును స్మరించియున్నారు.

అందు మారన

"సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచున్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహిత న్మును ద్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టి వి
ద్యారమణీయు నంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్."

అని భారతసారకథాసుధారసము నాగళపూరితంబుగా జనులుగ్రోలు నట్లుగా రచించెననియే వ్రాసియున్నాఁడుగాని, యీతడు తిక్కనవ్రాఁతను బట్టియే వ్రాసియుండకపోయినచో, మార్కండేయ పురాణమును దెనిఁ గింపఁ జేపట్టిన యీతఁడు నన్నయ యరణ్యపర్వశేషము నేల పూరింపక విడిచియుండెనో తెలియదు. నన్నయ రచిత భాగము నీతఁడు చూచియే యుండె నన్నచో నందలి శేషమును రచింపకుండుటకు భయకారణము తక్క వేఱు కారణము కనఁబడదు. కేతన దశకుమార చరితమునను నన్నయను స్మరింపనైనలేదు. ఎఱ్ఱాప్రెగ్గడకు కొంచెము ముందుకాలము వాఁడగు విన్నకోట పెద్దనగూడఁ దెనుఁగుకవిత్వమున్నఁ జెవిఁబెటలేకుండి రని చెప్పుటనుబట్టి రాజమహేంద్రవరపండితులు నన్నయ గ్రంథమును వ్యాప్తిలోనికి రాకుండఁ జేసిరేమో యని సందేహించుట కవకాశము లేక పోలేదు. ఎఱ్ఱాప్రెగ్గడ కాలమున నాంధ్రదేశ పాలకులైన కొండవీటి ప్రభువుల ప్రాపును బడసి రామాయణమును రచించి, భారతమునకు శేష భాగమగు హరివంశమును రచించు సందర్భమున నీ నన్నయ రచిత భాగ మును బయటకుఁదీయించి, యది కొఱవడియుండుటను జూచి యద్దాని బూరింపఁగడఁగెనని తోఁచుచున్నది.

కునివలనఁ గలుగు భయపరాభవాదుల మాట యెత్తరయే, ఆత్మగౌరవ
మును, మొదట తాను జేసిన సహాయమునే, పురస్కరించుకొని గంభీర
ముగా ప్రతిఘటించుచుఁ బలికి తప్పించుకొనఁ జూచినరీతియు, వెళ్ళక
తప్పక వచ్చినపుడు "పాండుపుత్రులకేను దప్పని మనంబుగలుగుదాన"
నగుటచే "నన్నుఁ గేవలము ముట్ట నెవ్వరికివచ్చును" అని తలంచి
"హృదయపుండరీకమున బుండరీకాక్షునినిక్షేపించుకొని" సుదేష్ణ మందిరంబు
వెడలు సమయమున జూపిన ఆత్మపాతివ్రత్యబలము, మనోధైర్యము,
భక్తివిశ్వాసములును; విరటుని సభలో "గుణవతుల గరువచందము
దొలఁగగ నట్లునికిఁ దగునె" యని ప్రశ్నించిన ధర్మజుని ప్రశ్నకు సాభి
ప్రాయముగా, చమత్కారముగా తన గరువతనమును నిలుపుకొనుచు,
ధర్మజుని నెత్తిపొడుచుచు బదులుపల్కినరీతియు. కీచకునినిర్జింప నియో
గించినదై భీముని యొద్దఁజేరి యాతని నాశౌర్యమునకై పురికొల్పిన
రీతియు, మఱునాఁడు కీచకుని మాటలకు "మెత్తపడినయట్లు సుభగమెయి
వడి చూపుగాఁ జూచి" కష్టంబు దప్పకుండ మిగుల జాగరూకతతో నెట్లు
సంకేతంబుసేసినదియు కీచకుని చావుఁజూచి చేసిన స్త్రీ సహజములగు
చేష్టలను, ఉపకీచకుల వధానంతరము సహోదరమరణ శోకాతుర యగు
కైకేయికడకుం జనునప్పుడు పొంగిపొరలి వచ్చుచున్న 'సమ్మదపూరము
నకు గరువతనమను బలితంపు గట్టువెట్టి, ధీరయైవిరక్తి శేర పలికినరీతియు,
నాద్రౌపదియొక్క స్వభావస్వరూపములను రెంటినిగూడ నెంతచక్కఁగాఁ
చిత్రించిచూపుచున్నవో గమనింపుఁడు. కష్టములందు సహితము ధైర్య
స్థయిర్యములు, ఆత్మవిశ్వాసము, నిగ్రహము, ఆత్మగౌరవము, ముఖ్య
ముగా 'గరువతనము' ఇవియే యీమె స్వభావమునఁ బ్రధానగుణములుగాఁ
జూపినాఁడు తిక్కన. ఈమె "గరువతనము"ను గూర్చి స్వయముగనే
గాక, కీచకుఁడు ధర్మజుఁడు, సుదేష్ణ మొదలగు పాత్రలచేఁగూడ పలు
మారులు ప్రశంసింపఁ జేయుటచే, నిది యీమెయెడల నొక ప్రత్యేకలక్ష
ణముగాఁ జూపి పోషింపఁదలచిన ట్లున్నాఁడు. తిక్కన ద్రౌపది శీలము
లోని ప్రధానలక్షణము 'గరువతనమై' నట్లే తిక్కన సుదేష్ణ శీలములోని

ప్రధానగుణము 'శాంతమై'నట్లది యామెచేసిన ప్రతిస్వల్పకృత్యములోఁ గూడ నెట్లు వ్యక్తమైనదో యిదివఱకే గమనించియున్నాము.

### తిక్కన రసపోషణ రీతులు

తిక్కనార్యుని పాత్రపోషణ పద్ధతులవలెనే రసపోషణరీతులు ననితర సాధారణములు. ఇతని కవితా కళ కంతకునుగూడ స్వాభావికత్వగుణమే (realism) మూలతత్త్వమగుటచే, నాటకీకతో కతి చిత్రప్రయోగముచేతనే యాయాపాత్రల స్వభావోన్మీలనమును సాధించి సన్నివేశసందర్భముల యందలి పాత్రల మనోవృత్తులను, వారి సహజ చేష్టలను సత్యల్పముగ వర్ణించుటచేతనే యాసన్నివేశమును మనకు గోచరింపఁజేసి యా రసస్ఫురణను గలిగించుచుండును. ద్రౌపది యందలి మోహాంబునఁ బరితాపమును బొందు కీచకుని శృంగారభావములను, చేష్టలను వర్ణించుచు విప్రలంభశృంగారరసము నతిరమ్యముగాఁ బోషించినాఁడు. కీచకుని శృంగారభావములయొక్కయు, మనోవృత్తుల యొక్కయు, గమనపైఖరుల నెన్నిరీతుల వర్ణించి రసము పుట్టించినాఁడో యిదివఱకే చూచినాము. ఇఁక దక్షిణగోగ్రహణ సందర్భమునను, నంతకంటె నుత్తర గోగ్రహణ సందర్భమునఁ 'వీరరసమయాత్ముఁ డగు' నర్జునుని పరాక్రమ విజృంభణమును వర్ణించుపట్లను, తిక్కనార్యుఁడు తన వీరరస పోషణచాతుర్యమును వెల్లడించెను. ఇట్లు ప్రధానరసముల కీ యాశ్వాసమునఁ బ్రాధాన్యమిచ్చి తిక్కన హాస్య, రౌద్రాదుల నాయా సందర్భాను సారముగా స్ఫురింపఁజేసెను. సింహబల ప్రభృతి కీచక విధ్వంసనంబునం దలిపొంది పురంబు సొచ్చి రాజవీథి నరుగు ద్రౌపదిని జూచి పులిఁగనుఁ గొన్న లేఁడులఁబోలి భీతిఁగలంగి "గరమున నుదర మప్పళించి యమ్మరో రక్కసి యంచు నుల్లములుచు వారునై" యున్న పురజనుల భయచేష్ట లను వర్ణించుచు హాస్యరసస్ఫురణ కవకాశము గలిగించినాఁడు తిక్కన. ద్రౌపదియు నంతరంగమున నిండిన హాస్యరసంబు మోముపై వెలివిరి యంగనీక చనినదఁట. ఉత్తరుఁడు

"తెప్పించి తొడుగు మీఁదని
యొప్పించిన నిట్టునట్టు నొఱవలుగాఁ మై
గప్పికొని యాబృహన్నల" యుఁ
గొంత హాస్యరస స్ఫురణమునకుఁ గారకుండయ్యెను.

రౌద్రరసస్ఫూర్తి భీమునియందే మనకుఁ బరముగాఁ బొడసూపుచుండును. కీచకునిచేఁ బరాభవింపఁబడి యార్తయై విరటునిసభఁ జేరి మొఱవెట్టుచున్న ద్రౌపదిని సభలోనుండి చూచిన భీముని ఘనతరకోప వేగమున నిప్పులురాలు కన్నులయందును, సాంద్రఘర్మజలబిందుబ్రగుమ్ఫిత యంగంబు లందును, 'నితాంతదంతపీడనరటదాస్యరంగవికట భ్రుకుటీ చటుల ప్రవృత్తనర్తఘటనా ప్రకటభయదస్ఫురణా పరిణతమూర్తి' యందును రౌద్రరస మెట్లు మూర్తీభవించినదో యింతకు పూర్వమే గమనించియున్నాము. భీముని రౌద్రరూపమును వర్ణించుపట్ల తిక్కనార్యుఁడు సందర్భమునకుఁ దగిన భాషచేతనే యారౌద్రరూపమునెట్లు ధ్వనింపఁ జేసెనో చూడుఁడు. భీముఁ డుపకీచకులం జంపు సందర్భమున "నాదువల్లభకు వీండ్రును, నింతజేసిరే యనుచు సరోషసంభ్రమిత నాయితమై" యొక్క—

"యున్నతావనీజంబు వెఱికి రౌద్రాతిరేక
మడర నిజభుజశిఖరంబునం దమర్చి"
"వికటభ్రూకుటి ఘోర ఫాల కలితస్వేదోద్భటుఁడుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం బ్రవర్ధనదశావిర్భావసంభావితాం
గకుడుం జిత్రవిధానదోహల సముగ్రక్రోధవేగుండునై
బకవిధ్వంసకుఁడయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తివిస్ఫూర్తితోఁ—"

ఇఁక నర్ధరాత్రమున భీమునిఁజూచి పాఱు కీచకుల స్థితిని వర్ణించు సందర్భమునను, కౌరవసేనఁజూచి పాఱు నుత్తరుని వర్ణించు సందర్భమునను భయానకరసస్ఫూర్తిఁ గల్గించినాఁడు తిక్కన.

"వెలవెలఁబాఱుచు వెగటొంది పెదవుల
తడి యాఱ నెంతయుఁ దల్లడిల్లి
జల్లనసంగంబు జెల్లు నిండఁ జెమర్చి
పదములఁ గరములఁ గుదియఁబడఁగ
హృదయంబు చటతట నదరంగఁ బెలుకుఱు
దీనదృష్టుల మోముదేలి చూచు
నెలుఁగుగద్గదికఁ దొట్రిల నేడ్చు విడుమని
ప్రార్థించు మాటఁ గీడ్పాటుదోఁప"

అని యాతని యార్తస్వరూపమును వర్ణించుచు నుత్తరుని యప్పటి బాహ్యస్వరూపమునే గాక యాతని గుండెలు తటతట గొట్టుకొనుటగూడ మనకు వినఁబడునట్లు చేసెను.

"కుర్యాన్నిర్వహణేఽద్భుతం" అన్నట్లుగా తుద నైదవయాశ్వాసమున పాండవులు విరటునికిఁ దమ్మెఱింగించుకొని బయలువడు వారై యున్న సందర్భమున నద్భుతరసస్ఫూర్తి కవకాశము గల్పించినాఁడు;

ఇదియేమి కంక నీవు
న్మదవృత్తిని శంకదక్కి నాగద్దియపైఁ
బదిలంబుగఁ గూర్చుండితి
వదియునుగా కిపుడు దిగ వహంకారమున౯"

అని పలికిన విరటునకు మందహాసంబుచేసి సంక్రందన నందనుండు

"కౌరవకులోద్భవుఁ డార్య నికాయసమ్మత
ఖ్యాతచరిత్రుఁడీ చిరుతగద్దియకుం దగఁడే నరేశ్వరా."

అని బదులు చెప్పుచు నాతని విస్మయసంశయములు పెనంగొన నాశ్చర్యరసాంబుధిని ముంచివేసినాఁడు.

శోకరసా విష్కరణము నెట్లు సాధించినాఁడో చూచుట కాశ్రమ వాస పర్వమున ధృతరాష్ట్రుఁడు గాంధారీ సహితుండై వనంబునకుఁ బోవు సందర్భము నొకదాని గ్రహింతము. వారు వనమె వెడలి

"గొంతి మొదలైన కౌరవ
కాంతాజనులెల్ల నెవ్వగలఁ బొగులుచుఁ బ
శ్చాంతంబుల బాష్పసలిల
సంతానములురలఁదోన చనుదేరంగన్

ఏగుచుండిరట.

"పాండవాగ్రజుఁ డక్కురు భర్తవలను
శోకదీనుఁడై తప్పక చూచి యేడ్చి
హా మహారాజముఖ్య యెందరిగెదనుచు
నొదలు కంపింపఁ జదికిలఁబడియెనధిప.

ఆ ధర్మజుని స్థితి, పలుకులు, కృత్యములు, వర్ణించి యెంతలో నా శోక రసమును పెంపొందించినాఁడో చూడుఁడు. ఏమియు చేయలేక యేడ్చి యేడ్చి తుదకుఁ 'నొదలు కంపింపఁ జదికిలబడియె' ననుట, యీ సందర్భ మున నెంత స్వాభావికమై రసోద్బోధకం బగుచున్నది. ఇంకను

"నరుఁడనునయించె వెనక
న్నరపతి నెత్తుచును దానవయమును వనటం
బురపురఁ బొక్కెం గురు భూ
వర యద్దెస తెలుఁగురాదు వాక్రువ్వంగన్"

ఈ తుదివాక్యముచే నాస్థితివర్ణింప శక్యముకానిదని చెప్పుచు నా శోక రసము నెట్లు పరాకోటి నధిష్ఠింపఁ జేసినాఁడో గమనింపుఁడు. పిదప కుంతియు నరణ్యమునకుఁ బోవ సిద్ధపడుటయు, ధర్మజాదులు వలదని ప్రార్థించుటయు, నా సందర్భమున వారి సంభాషణంబులు, చేష్టలు,

పిన్నలు, పెద్దలు, నెంతయు సుదాత్తంబులై, యెట్టి ధైర్యవంతున కైనను కన్నీళ్ళు దెప్పించునవై యున్నవి.

## తిక్కన రచన - నాటక రీతులు

తిక్కనామాత్యుని రచనయందలి నాటకరీతులను ( *dramatic elements* ) గూర్చి యింతకుఁ బూర్వ మా యా సందర్భములఁ గొంత తెలుపఁబడియే యున్నది. కావున నా రీతి లక్షణములను మాత్ర మించుక గ్రహింతము. విరాటపర్వము నొక ప్రబంధముగాఁ జేయనెంచినను, అందు నాటకమందువలె వస్త్వైక్యము (*unity of plot*) నెట్లు సాధించినాఁడో చూచి యున్నాము. కథాప్రస్తుత నాటకమందు నాందీపద్యమున వలె కథా ప్రారంభమునందే "సహిత సముత్సవాలంకృతు" లన్న పద్యము ననూచింపఁ బడినది. మూలములోని పర్వములవలెనే యిందలి యాశ్వాసములు నైదే యున్నను. అందలి కథాంశముల నాశ్వాసములుగ విభాగించుపట్ల తిక్కన కొంత స్వాతంత్ర్యము వహించినాఁడు. పూర్వాశ్వాసములందలి కథాంశము ఉత్తరాశ్వాసము కథ నెట్లు దారితీయుచు సూచకము లగునో సందర్భానుకూలముగా వ్యక్తము చేసినాఁడు. ఈ పర్వము "నానారసాభ్యుదయోల్లాసి" యని చెప్పుచు శృంగార వీరములకుఁ బ్రాధాన్యము కల్పించి, "కుర్యాన్నిర్వహణేద్భుతం" అను నాటక నియమమున కనుకూలమగునట్లుగాఁ జివర నద్భుతరసమును బోషించినాఁడు. ఈ విరాటపర్వకథ మంగళాంతమే యగుటచే తిక్కన కేమియు చిక్కు లేకపోయినది. కావుననె యుత్తరావివాహము నత్యుత్సాహముతో వర్ణించినాఁడు. ఇట్టి లక్షణములన్నియు దీనియం దితనికిఁ గుదిరినవి గనుకనే మొట్టమొదట దీనిని గూర్చి యంతగా బొగడినాఁడు తిక్కన. ఇక వస్తు విస్తర విషయమును గమనింతము. సహిత సముత్సవాలంకృతులగు పాండవు లంగనాసహితులై యహితుల కప్రభేద్యమగు నాపదమూఁడగు నేఁడు గడపి బయలువడుట గదా యిందలి వస్తువు. ఈ విషయమునే బీజరూపముగాఁ, —

"ఒకనాఁ దే మును నావద
లకు విపుమర గాంచి విప్రులం జుట్టలఁ బె

టుఁగొని సుఖముండఁ బడయుదుమొకో"

యని ధర్మజునిచేఁ బలికించి,

"మనలోన నెవ్వఁ డెమ్మెయిఁ
బనిపెంటను విరటుమనము వడయుద మది యె
ల్లను నేర్పఱించి యందఱు
తనతనమదినున్న తెఱఁగు నేర్పడ చెపుఁడా"

అని కార్యారంభమును సూచించినవాఁడె నాఁడు. పాండవులు విరటుని కొలువుఁజేరి కాలము గడుపుచుండ రెండవయాశ్వాసమున సుదేష్ణ యింట నున్న ద్రౌపదిని జూచి కీచకుఁడు మోహించుట, దాని మూలమునఁ గలిగిన "యవాంతరార్థ విచ్ఛేదమునకు" భీమునిచే రహస్యము బయలువడ కుండఁగా సాధింపఁబడినకీచకవధ, "అచ్ఛేదకారణం" బగుటచే బిందువు సూచింపఁబడినదనవచ్చును. ఈ కీచక వృత్తాంతము కథాప్రవృత్తి కొక విధమగు సంకీర్ణత్వము (*complexity*) నాపాదించిన దన్నమాట. ఈ సంకీర్ణత్వము భీముని కీచకవధ మూలముగా పెంపొంది, యీ కీచకవధ వృత్తాంతమును చారులవలన విన్న దుర్యోధనుఁడు పాండవుల నెట్లైన బయలుపెట్ట నుద్యోగించియున్నవాఁ డగుటచే విరటుని యొద్ద పాండవుల యునికి శంకించి, వీరిని బయలుపెట్టుటకు గా విరటునిపై నెత్తిపోవలయు నని నిశ్చయించెననుటలో నుచ్చస్థానమును బొందినది (*reached crisis*). ఈ దుర్యోధన ప్రయత్నమే 'పతాక' యని చెప్పఁదగియున్నది. దక్షిణ గోగ్రహణసందర్భమున దాము బయలువడక విరటుని విడిపించి సుశర్మ నోడించుటచేతనే 'ప్రాప్త్యాశ' కలిగినది. దుర్యోధనుని యుద్దేశము మూలముగా, పాండవు లహితుల కప్రభేద్యమైన అజ్ఞాతవాస సమయమును దాఁటుట విషయమునఁ గలిగిన చిక్కు (*complexity*) దక్షిణ గోగ్రహణ విజయముచే కొంత విశ్లేషత్వ మార్గమును (*resolution*) బట్టుట కారంభించిన దన్నమాట. కథాసంకీర్ణత్వమునందలి యుచ్చస్థానమును (*crisis*) సామాన్యముగా షేక్స్పియర్ కాళిదాసాదులవలెనే,

యైనాశ్వాసములలోఁ జెప్పఁబడిన యీ కథలో మధ్యభాగముననే, అనఁగా
మూఁడవ యాశ్వాసపు నడుమభాగముననే పెట్టుటలో తిక్కనార్యుఁడు
చూపిన నాటకకళాభిజ్ఞతావైభవము నిదివఱకు గమనించియే యున్నాము.
కాళిదాసుకూడ నేడంకములుగల నొప్పుచున్న శాకుంతలనాటక చక్రమునకు
నాభివలె (లేదా, ఇరుసువలె) నున్న దుర్వాసశాపమును నాలుగవయంకము
మొదటనే, అనఁగా గ్రంథమునకు మధ్యముననే, యుంచి తన కళాచాతుర్య
మును వెలఁయింప జేసినాఁడు. ఉత్తరగోగ్రహణ సందర్భమున నర్జునుఁడు
బయలువడుట, భీష్ముఁడజ్ఞాతవాస వత్సరవ్యాప్తి నిరూపించి ద్రోణ
దుర్యోధనాదుల సందేహమును బాపుట, యర్జునుని యుత్తరగోగ్రహణ
విజయము మొదలగునవి 'నియతాప్తి'ని సూచించుచున్నవి. మఱునాఁ డుద
యమున ధర్మజుఁడు విరటుని సింహాసనము నాక్రమించుట కారణముగా
పాండవులు బయలుపడుట, దాని ఫలితముగా నుత్తరావివాహము ఫలా
గమమును సూచించుచున్నవి. ఇట్లే విరాటపర్వ రచనయందు తిక్క
నార్యుఁడు నాటకమునకు వలయు సంధ్యాది లక్షణములనుగూడ నొకవిధ
ముగ సమకూర్చినవాఁడని చెప్పవచ్చును. ఆయాపాత్రల స్వభావమున
కనుగుణంబులును, సయుక్తికంబులు, సక్రమంబులు నగు సంభాషణల
మూలమునను, ఆయాసందర్భముల నామాటలాడు వారి యొక్కయు, విను
వారియొక్కయు నాకారేంగితములను, హావభావాదులను వర్ణించి, నాటక
కర్త యాయాసందర్భముల నాయాపాత్రలు చేయవలసిన పనులను దెలుపు
(*stage directions*) రీతి నా పాత్రలను మన కనులయెదుటఁ బెట్టుచుం
డుటచేతను, రసానుగుణంబుగ వారి మనోవృత్తులను వివరించుచు నెక్కడి
కక్కడ నాయాపాత్రల కృత్యములను, చేష్టలను (*action*) పదములచే
నతిస్వాభావికముగ వర్ణించి చూపుచుండుటచేతను, తిక్కనార్యుఁడు తన
రచనకు నాటకలక్షణ మబ్బునట్లు చేసినాడు. మఱియొకవిశేష మేమనఁగా.
నాటకము లేదో యొక విధముగు వెలుఁగులోఁ జూడఁదగిన కాని చీఁక
టిలోఁ జూడఁదగినవి కావు. కాని తిక్కనార్యుఁడు చీఁకటిలో జరిగిన
ద్రౌపదీ భీముల సంభాషణా సన్నివేశమును. భీమకీచకుల యుద్ధమును

గూడ మనకనుల కగపడునట్లు చేసినాఁడు. మూలమున నంత వ్యక్తము లుగ లేని (*hazy*) ఆయాపాత్రలను, వారి గుణశీలము లనుసుస్పష్టముగఁ వారి ప్రత్యేకవ్యక్తిత్వమును (*individuality*) స్ఫుటపఱచినాఁడు. మొత్తముమీఁద నీతని కవితకు ముఖ్యలక్షణంబగు 'స్వాభావికతా' గుణమే యాభారతకథ యెప్పుడో యెచ్చటనో జరిగినదివలెఁ గాక, మనకనుల యెదుట జరుగుచున్నదానివలెఁ బ్రత్యక్షానుభవములోనికిఁ దెచ్చుటకు విశేష ముగాఁ దోడ్పడినదని చెప్పవలసియున్నది. ఆగుణమునే యాతనిభాషా శైలులలోఁ గూడ మనము గుర్తింపవలసియున్నది.

## తిక్కనార్యుని భాషాశైలులు

ఈకవి చిత్రించిన పాత్రము లతిమానుషలక్షణములు (*super-natural*) కలవారు గాని, లేక కొయ్యబొమ్మలవలె చలనములేక యున్న వారు గాని కాక మానవమాత్రులును, స్వవ్యాపారమందు వ్యాపృతులునై యున్నట్లే, వారి భావములు నతిమానుషములు, సాంకేతికములు (*conventional*), కృత్రిమములు గాకుండుటచే, వారిభాషయు సహజము, స్వాభావికము, నకృత్రిమమునై యొప్పుచున్నది. ఇట్టి స్వాభావికత్వమును సాధించుటకుఁగా నీతఁ డవలంబించిన రచనారీతి యొక్క విశేషగుణము లను, మన మారయవలసి యున్నది.

౧. పూర్వోత్తర సందర్భములకుఁ జక్కని పొందిక కల్పించుట. ద్రౌపది, ధర్మజభీమాదులు మొదట తా మెట్లు సంభాషించుకొనుచునది, దానికిఁ దగినట్లుగనే వీరు విరటునికొలువు చేరు సందర్భమున నాయా సన్ని వేశము లెట్లు కుదిరినది యిదివఱకే పరిశీలించియున్నాము. అర్జునుఁడు గోగ్రహణసందర్భమునఁ గురుబలంబులఁ గోశద్వయమాత్రంబునం గూడ మట్టి తలయెత్తి చూచి యచ్చటి కౌరవసేనా సన్నివేశము నంత నుత్తరున కెఱింగించి, "కురురా జెట నున్నవాఁడొకో; "విచ్చిచనకుండ పసులం దెచ్చుట మునుమున్న వలయు తెఱఁగు" అని యీ రీతి తాను చేయఁదలంచిన యుద్ధక్రమమంతయు (*plan of attack*) దెలియఁజెప్పి,

తదనుగుణంబుగనే యుద్ధక్రమము నడిపి విజయము సాధించెను. భీముఁడు కీచకుని సంకేతప్రదేశమునకు రప్పింపుమని చెప్పియు, "వచ్చిన నాసొబగునిం బెగడుఁ జూచి నీకుం జూపి నీచిత్తంబు వడసెద" అని చెప్పినదానికి సరిగనే సూర్యాస్తమయం బైనపిదప నాకృశోదరి వృకోదరుకడకుం జని సమయ మయ్యెనని చెప్పి, యాతనితోన వెనుక నల్ల నంతంత నరిగినట్లును, అతఁడీమెను పర్యంకంబున కనతిదూరంబున నోసరిల నునిచినట్లును, తుద "కినలము గూఢయత్నమున నయ్యెడకుం గొనివచ్చి దానిఁ జయ్యనఁ వెలిగొందఁజేసి" యామెకా 'వినుమానవుఁ బీనుఁగు'నుఁ జూపి నట్లును ప్రాచీన మూలపాఠమునందు లేని విషయమంతయుఁ జేర్చి రచించి నాఁడు. ఉత్తరుఁడు తండ్రి కుత్తరగోగ్రహణ విజయ సందర్భమును దెలుపుచు, తాను కురుసేనఁ జూచి భయమొంది రథము డిగ్గి పాఱినది మొదలు జరిగిన వృత్తాంతమంతయు యుద్ధక్రమముతోఁగూడ నెట్లు జరిగినదిగా ముందు వర్ణింపఁబడినదో యట్టే వర్ణించి చెప్పునట్లు చేసినాఁడు.

"తేన తే నిర్జితా గావ స్తేన తే కురవో జితాః,
తస్య తత్కర్మ వీరస్య న మయా తాత యత్కృతమ్"

అని రెండుమూఁడు శ్లోకములుమాత్రమే కలవు మూలములో. వెనుక జరిగిన విషయములనుగూర్చి మరల చెప్పవలసి వచ్చినపు డాయా పాత్ర లాయా సందర్భములఁ జెప్పినమాటలనే మరల ననువదించి చెప్పు నట్లు చేసినాఁడు.

౨. ఉపమాలంకార ప్రయోగము: సామాన్యముగా తిక్కన యలంకారములనే ప్రయోగింపఁడు. ప్రయోగించినపు డాదృశ్యమును మన కన్నులకుఁ గట్టినట్లు చేయుటకుఁగా సాధారణముగా నుపమాలంకారమునే-పూర్ణోపమనే-ప్రయోగించుచుండును. కీచకుఁడు

"సింగ మున్నగుహావిశేషమునకున్ శీఘ్రంబునన్ వచ్చు మా
తంగంబుం బరడించుచు బవనపత్ర స్వీకృతంబైన యా

రంగాగారము చేరవచ్చె."

ఇక్కడ భీముఁడు సింహము. కీచకుఁడు మాతంగము, కొంతయుద్ధ మైన పిదప

"వాని నడంగఁ బట్టి పడవైచి మహోగ్రత నాక్రమించెఁ బం
చానన మేణముం బొదవునట్లు."

భీముఁడు కీచకుని గ్రిందఁ బడవైచి యాక్రమించు సందర్భమున నాతఁడు పంచాననము, కీచకుఁడు ఏణము నైనారు. సందర్భానుకూలముగా మార్చినాఁడు. అప్పుడు కీచకుఁ డుద్భటుండై "సమీరసుతునల్కఁ ద్రొక్కిడినట్లు వీఁకతోన్" నెగసెనట. తీఁగెకుఁ ద్రొక్కు వెట్టిన నంది పుచ్చుకొనినట్లు పైకెట్లు విజృంభించునో యట్లే భీముని యల్కయు కీచకునితోడనే పైకి నెగసినఁదట. అంత నీతని పిడికిటి పోటు దిన్న కీచకుఁడు నేలంబడుటను దెలుపుట కెట్టి యుపమానమును గూర్చెనో చూడుఁడు:

"పల్లవప్రసూన ఫలభరితంబగు
ద్రూను గూలఁ ద్రోయు మత్తగజముఁ
బోలె వివిధ రత్నభూషణ భూషితుం
డైన సూతుఁ గూల్చె ననిలసుతుఁడు."

యుద్ధవర్ణన సందర్భమున నీతఁడీ యలంకార ప్రయోగము విశేషము నొనర్చిన ట్లగపడును.

"నరు లొరులు దృశ్యములపైఁ
బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు పడుఁ దప్పక యొ
ప్పరుసున నరుఁ డేయునిశిత
శరములు లక్ష్యములు దప్పి చన వించుకయున్."

"కరి సొచ్చిన తుంగమడువు
పరుసున మోన చాఁపకట్టువడియె నతనిచేన్."

"శితక్రోధనుఁడగు నరుఁడు
ద్రావిడితగతి నడుమ మెఱసి బాడబాగ్ని దశం
బై జలనిధిఁ ద్రెక్కొనియెడు
నోజం గురుబలము పేర్చి యుడిపెం గోల్తోన్."
"సవ్యసాచి బాణసంఘంబు మత్త శుం
డాల ఘోరలీల గేలిసలిపె."

కేసరివిక్రముండు "బాణజాలవిన్యాసమునన్ వెసం బొదివె నర్కసుతుం గరుడుండు పాము నుద్భాసితపక్షుఁడై పొదువుభంగి." ఇచ్చట బాణజాలవిన్యాసమునకు గరుడుని "యుద్భాసిత పక్షముల"కు నౌపమ్య మెంత చక్కగా సరిపోయినదో గమనింపుఁడు.

"సంగ్రామం బభిరామం బయ్యెను ఘోరప్రకారంబయ్యె" నని వర్ణించు సందర్భమున నుపమాలంకారమును మిగుల దీర్ఘముగఁ బెంచినాఁడు. ఇట్టి దీర్ఘోపమల (*long drawn out similes*) నచ్చటచ్చట తిక్కనార్యుఁడు ప్రయోగించుచు నేయుండును.

"ప్రళయాంభోధరముక్త సాంద్రవిసరత్పాషాణ వర్షంబు మి
క్కిలియై శైలము గప్పునట్లు నరునక్షీణాస్త్రసంతాన మి
ట్టలమై కప్పినఁ దీవ్రమారుతము గాఢవ్యాప్తి జీమూతమం
డలిఁ బోలెన్ విరియించె భానుజుఁ డవష్టంభోజ్జ్వలాకారుఁడై."

దీర్ఘతరంబైన రూపకము (*a prolonged metaphor*) న కుదాహరణము:

"రోషంబు భీషణ రూపమై చెలువొంద
నతులకేతువు శిఖయై వెలుంగ
శరజాలములు పటుజ్వాలలై నిగుడ న
ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్ల

సద్ధతి సైఁపక యుజ్జ్వలదివ్య ప
 తాక మెఱుంగు గా దళితధరణి
రథనేమిరవము గర్జనముగ శరపరం
 పరలు ధారలుగాఁగఁ బరఁగియడరె
నర్జునాంబుదం బనన్యసామాన్య స
ముద్యమమున ముఖపయోరుహములు
కాంతి దఱఁగి యపుడు కౌరవసేనా స
రోవరంబు దీనభావ మొంద."

తిక్కనార్యుని యుపమానములు కొన్ని యాతని మానసికవృత్తి వైభవము (*intellectual similes*)ను సూచించుచుండెను. "రాగాదివికార విరాసనంబునం బ్రసన్నయయిన బుద్ధియుంబోలె సింహబల ప్రభృతి కీచకవిధ్వంసనంబునం దెలివొందె"నది ద్రౌపది.

నర్తనాగారము—వివేకరహితుహృదయంబునుంబోలెఁ దమో దూషితము, విదగ్ధవనితా ప్రేమంబునుంబోలె దుర్నిరూప్యము, అనభ్యస్త శాస్త్రంబునుంబోలె దుర్గమంబు, స్వాప్నలబ్ధపదార్థంబునుంబోలె నదృష్టిగోచరంబు, విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబు" నై యున్నదఁట.

"కుంతీసుత కాంతా చింతా మహాంధకారము, సంతసమను పద్మ రించిన దన్నట్లుగా ప్రభాతం బయ్యె"నఁట.

తిక్కనార్యుని యుపమాలంకార ప్రయోగవైచిత్ర్యము పరిశీలించిన కొలఁది పెంపొందుచునే యుండును.

౩. సందర్భానుకూలముగ భావమును స్ఫురింపఁ జేయునదియగు బంధము—పదరచన, (*sound echoing the sense*).—ధర్మజుఁడు భీభత్సుని నకులుని, ద్రౌపదినిజూచి ఘూర్ణమాన మానసుఁడగుచు, నెలుఁగు చందంబువేఱుగా, భిన్నాంతఃకరణుఁడగుచు, వారెట్లు మెలంగుదురో యని పలికిన పలుకు లాతని హృద్గతావేదను వ్యక్తము చేయుచు నేయుచున్నవి.

...సంవర్భములందును, ద్రౌపది తనపడిన పరిభవంబు నెఱిఁగించు సందర్భమునఁ గూడ నీతని యుత్పలమాలా వృత్తరచన మెంతయు సందర్భానుకూలమై యున్నది.

వర్ణన సందర్భముల సామాన్యముగా సమాంతర వాక్యములుగల పాదములతోఁ గూడిన సీసపద్యములను వ్రాయుచుండుటయేగాక, మొదటి నాలుగు పాదములలో వస్తుస్వరూపమును వర్ణించి, పిదప దానిఁ జూచి నందువలనఁ గలుగు భావవృత్తిని (*impression on the mind*) వర్ణించు చుండుటను కవీశ్వరుఁడొక్క- "చండమూర్తి"ని వర్ణించిన సందర్భమునఁ బరికించియే యున్నాము. భీముని కోపాటోపమును పటుదీర్ఘ సమాసముచేఁ జక్కఁగ ధ్వనింపఁజేయుటయు గమనించి యున్నాము. 'దుర్వారోద్యమేత్యాది' పద్యమునందలి పటుదీర్ఘ సమాసము, తుదకు 'కీచకా' యను సంబోధనము, ద్రౌపది కీచకుని శంకించుట కెంతయుఁ దగియున్నవని తలఁచియున్నాము. కీచకుని యురియాటము నొక గీతపద్యమున "తుదిముట్టగాన విశ్రమింపఁ గలఁగుఁ డేలు" అనియు; చిక్కిముడిపాటును "చిడిముడిపడు, భ్రమానుపడు, వెడంగుపడు, పెనంబడుఁ, దల్లడపడు, దురంత చింతదారికినగపడు, సింహబలుఁడు" అనియు, దుర్యోధనుని చారులు పాండవులను వెదకుటను "పరగఁబొదరు పొదరు వల్లంబు వల్లంబు" *etc.* అనియు వర్ణించి యావదరచనచేతనే యాభావములను స్ఫురింపఁజేసినాఁడు.

ధర్మజుఁడు విరటునిఁబట్టిన సుశర్మపైకి భీమునిఁ బురికొల్పుట యందలి యాతురమును- 'సత్వరంబగు చిత్తంబు' అను పదములచే స్ఫురింపఁజేసినాఁడు:

"ఎయిదు మెయిదుము రథరయ మెసక మెసఁగ"

అర్జునుని గుర్తించిన యుత్తరుని యుత్సాహము:

"ననుఁబని గొమ్ము లెమ్ము కురునాథు నదల్పు మరల్పు గోవులన్"

ఉపకీచకుల బారినుండి ద్రౌపదిని విడిపించుటకుఁగా శ్మశానము నకుఁ బోయిన భీముని క్రోధవేగమును "వికట భ్రూకుటి ఘోరఫాల కలితస్వేదోద్ధృతి" త్యాది పద్యరచనయే స్ఫురింపఁ జేయుచున్నది.

తననుగేలిసేయుచున్న యశ్వత్థామకుఁ గర్ణుఁడు క్రోధఘూర్ణ మానతారకుండగుచు బదులుపలుకుట యాతని స్వభావమున కెంతయుఁ దగియున్నది:

"తలఁకెడువానికిన్ మగఁడు దానఁట నన్నడకించు వాఁ డిసీ, పలు కకు భీకున ట్లొదుగఁ బాఱునెఱూరుఁడు నిన్నునచ్చియే, కలనికి వచ్చితిఁగా"

దేవదత్తా భీలరావంబునకు లేటమొగముపసుచు నడుచు కౌరవరాజ సైన్యంబును గదిసినవాఁడు "ప్రళయ భైరవసహస్ర, గర్జనోదగ్ర తర్జ నుం డర్జునుండు"

కీచకునికి దినముసాగి నిలుచుట నీరచనయే స్ఫురింపఁజేయుచున్నది:

"అనుచుఁగ్రుంకింపరాని ప్రొద్దరసి యరసి

* * * * *

మిగుల వందిరి వందిరి పొగిలి పొగిలి."

విరటుని యొక్కయు, నాతనికొడుకు యొక్కయు "వీరాలాప ములు" వారి యవిచారితదాంబికత్వము నెంతయు చక్కగా సూచించు చున్నవి:

"ఏమీ నిక్కమె మున్నెఱుంగఁదె *etc*"

"తగుసారథి దొరకొనినం

బగతురభంజించు టెంత పని కదుషలద

వ్వగ గొనిపోదురాకో"

శత్రువుచేఁ జిక్కిన తన్ను విడిపించిన భీముని గూర్చి విరటుఁడు విస్మయము, సంతోషము జిత్తమున బెనఁగొనఁగా నిట్లనును:

"ఉపకారము బంధుజనము
కృపయో పెంపో సమగ్రకీర్తి ప్రియమో."

నానావిధ దీనాలాపములాడు నుత్తరునిఁ దేరుసేరం దెచ్చి యర్జునుఁ డాతని భయము మాన్పి సారథిగాఁ జేసికొను సందర్భమున నాతని పలుకు లెంత మృదువులై ధైర్యమును గొల్పునవై యున్నవో చూడుఁడు:

"వెఱవకుమన్న పోటు కురువీరులతోడ నశక్యమేని య
త్తెఱఁగది యేల నీవుడుగు, తేరికి సారథివమ్ము నాకు"

ఆయాభావములను స్ఫురింపఁజేయుటకుఁ గాని, యాయాపాత్రల గుణములను వ్యక్తపఱచుటకుఁ గాని తిక్కనార్యుఁడు ప్రయోగించు విశేషణము లత్యంత సార్థకములనుట కొక్కనిదర్శనము చాలును. అర్జునుఁ డుత్తరునిఁ జెట్టెక్కి గాండీవంబుడిసి యిమ్మనిన సందర్భమున నాతఁడది పీనుఁగని శంకించి "నన్ను నీచపుఁబనిఁ బనుపంగా నీకుం దగునె పాప కర్మముగాదే" యని చెప్పినపుడు, అదివిని "ధర్మనందనానుజుం డత్యాదరమున" "నమ్ముము శైదువుమోవగు" నని నమ్మఁబలికెనట. తిక్కన యిచ్చట నీవిశేషణమును ధర్మనందనానుజుఁ డధర్మవిషయమై యుత్తరుని ప్రేరేపింపఁడని సూచించు నుద్దేశముతోడనే వేసియున్నాఁడు. ఇందుకు నిదర్శనముగా మఱియొకచోట (-14) నర్జునునిచేతనే యీమాట వ్యక్తము చేయించినాఁడు. ఉత్తరునికి నమ్మకముగలుగుటకై తననామములను వాని యర్థములను దెల్పుచు

"పృథయుగఁ బలుకుదు నేయవి
తథవచనుండైన ధర్మతనయానుజుఁడన్."

అని పలికించినాఁడు. దీనినిఁబట్టి తిక్కనార్యుఁ డాయాసందర్భముల నాయా విశేషణములను జూచి ప్రయోగించు కళాకుశలుఁ (*a consious artist*) డని తలంపఁదగియున్నది. ద్రోణుఁ డావచ్చువాఁడు ఫల్గుణుఁడే యని నిశ్చయించి దుర్నిమిత్తములఁ జూపి యుద్ధసన్నాహముం జేయ నుత్సహించిన సందర్భమున దుర్యోధనుఁ డాతనికి బదులుపల్కిన రీతి యాతని స్వభావమున కెంతయుఁ దగియున్నది:

"అర్జునుఁడైన నేమి సురనాథుఁడైనను నేమగు విద్విషచ్ఛిదో
పార్జితమైన గోగణముఁ బట్టితి మెవ్వరు వచ్చిరేని."

ఈశైలిలోనే యాతని స్వాతంత్ర్యప్రియత్వము, ఇతరులమాటను లక్ష్యము చేయ నొల్లకుండుట, ద్రోణునుపాలంభించుబుద్ధి, అర్జునునియందు సూయా పరత, మొదలగునవన్నియు స్ఫురించుచున్నవి. అర్జునుఁడు ఉత్తరునితో "ధార్తరాష్ట్రగజుఁ డీతనిం గదిసినప్పుడు పందువు నాదు మత్తరా" యనిపలికి అతని

"తేరుమనకారికగపడు తెఱఁగుగాంచి
యదరిబాసటయై యొప్ప రక్షపడిన
మెఱుఁగు మెఱసినచాడ్పునఁ దఱియఁజొరుము" అనెను.

రేఫాను ప్రాసయుక్తంబయి యీపద్యమున గంతులిడుచున్నశైలి (racy style) యందలిభావము నెంతచక్కఁగా వ్యక్తము చేయుచున్నదో గమనింపుఁడు.

౪. ఆంధ్రభాషాజాతీయ ప్రయోగనైపుణ్యము:—తిక్కనభారతము దేశీయపదంబులకు బడికి జాతీయమునకు నొకపెద్ద గని వంటిది. ఏ యొక్క కవియు నింతటి దేశీయపదజాలమును, జాతీయమును ఇంత గుణవత్తరముగా (Effectively) బ్రయోగించి యుండలేదు. అట్టి భాషా జాతీయప్రయోగమును చేయుటచేతనే యాతని కవిత కట్టి స్వాభావికతా గుణము, మహనీయత్వము నబ్బినవి. తిక్కన భావచ్ఛాయలను సూచించుటకుగాఁ బ్రయోగించిన దేశీయపదజాల మపారము. కీచకునింటికిఁబోవు ద్రౌపదికిఁగలిగిన భయ దైన్యము లంతరములను వర్ణించునప్పుడు ప్రయోగించిన పదజాలమును జూడుఁడు:—భయము, దైన్యము, వెగడు, తల్లడము, తలఁకు పుట్టుట, కొంకుకొలఁదికి మీఱుట, వెంగాటు, ముట్టుపాటు, వెఱఁగుపాటు, నొవ్వు, నెఱనాటుట, వగలు వగలనీనుట, దిగులు వొడువుట. కీచకుని పరితాపమును వర్ణించుచు నాఁడు చిదిముదిపడు, గ్రామానుపడు, వెడంగుపడు, వెసంబడు, తల్లడపడు, దురంతచింతభారికి

నగపడు నని చెప్పినాడు. మనోవికారమగ్నుఁ డగు కీచకుఁడు ఉగ్గడించు తల్లడించు, తలపోరగించు, నప్పళించు, తెగ నగ్గలించు, జనులం బరికించు, గళవళించును. సుదేష్ణ జారపొందు వర్ణించు సందర్భమున భయమున నుల్లి మదరు, పులులోటమున మోము వెల్లగిల్లు, కలతమై చెమటలు గ్రమ్ము దేరు, వెగడుట, చెయ్యాలువీడుపడు, కౌతుకం బురియాడ చవులుకొని యాడు. రెండవ పర్యాయము ద్రౌపదిని సుదేష్ణ మందిరమునఁ జూచి కీచకుఁడు చేయఁ దొడంగిన దుర్వికారముల నెంత స్వాభావికముగా వర్ణించి నాఁడో చూడుఁడు: వెంగలివలుకు వలుకు, నేల మునుగాళ్ళ నప్పళించు, రిత్తరిత్త చెలఁగినవ్వు, వెడపాటపాడు, చేరువఁబోలయు, ఇక్కడక్కడఁ బడు, తగులినమదింపఁజూచు. ద్రౌపదియందలి మోహపరితాపముచే నాతఁడు తలరు, నలంమరు, నవయు, వెచ్చనూర్చు, నొల్లఁబోవు, వెగడందు, గలంగు, పరిభ్రమించు, గొందలపడు, బెగ్గడిల్లు, చేడ్పడు. ఆ సమయమున నాతని మనోవృత్తు లెన్ని విధములో, పార్థుఁడు శంఖ మొత్తగా తోయధిసక్షకంబు కలఁగె, గిరివర్గము ఱటాడె, వసుంధర సంచలించె, ఆశాచక్రమల్లాడె, త్రిదశేంద్రు పట్టము కొందలమందె, పాతాళము ఘూర్ణిల్లె, తారకలాకులమయ్యె, వేదసంక్షోభించె. శత్రువుల శస్త్రాస్త్రసంచయము నర్జునుఁడు ద్రవ్వలు వాపె, బిట్టుత్రుంచె, నుఱుమాడె, పొడిచేసె.

సందర్భానుకూలముగ నీతడు ప్రయోగించిన జాతీయము ( *Telugu idiom*) తరువాత కవులుగాని పూర్వమున నన్నపార్యుఁడు గాని ప్రయోగించిన ట్లగపడదు. కాని యీపదబంధముల బిగి, శక్తి (*force and-vigour*) యిప్పటి మన వ్యావహారికభాషలో వలెనే గనబడుచుండును. కొన్ని యుదాహరణములను మాత్రము చూపెదను;

"విప్రులం జుట్టలం బెట్టుకొని సుఖముండుదుమో"

"దీని నౌగాదనుఁడా"

"ఎంత్రిప్పులేటికి కమలవదన"—డొంక తిరుగుడుమాటలని యిప్పుడు మన మందుము.

"కొంకు గొనరించుకయు లేక కూలఁదాఁచె"
"మిసుకుక్కన సూర్పుగలుగ నొక మూర్ఖునిచేఁ బడితిఁ"
"ఆపదలకెల్ల నోర్చెద దానికేమి"
"విచారము కోర్కికిఁగాని వావియే"
"ఇట్టి యవగాథపు పొత్తు మనంగవచ్చునే"
"నన్ను నిట్లాలి గొనఁగనేల"
"అతల కెద్దుట లేదు నేవియున్"
"రాధేయుం బొక చీటికిం గొనఁడు"
"సంవత్సరంబునుం జేఁవ చేయువల్ గడచె"
"తప్ప గ్రుంకతిఱదు నీకుఁ"
"కనికొలువు చేసికొని"
"ఆశాచక్రముల కొలఁదులు బారవెట్టంగ"
"నా నేర్చువనుల వెంట నీకడ నిలువంపలంచి"
"నేల నాలుగు చెఱఁగుల నృపులకొలువులందు వర్తించితి"
"వీనికి మార్కొనఁజాలెడు వానికి"
"అఁదుఁ బుట్టువులతోడన నీవును బుట్టినావు"
"వలదన్ననుడిగెడువాఁడుగాఁడు-మాయద్దైవము-నేనేమిచేయుదాన"
"ఆ లేమపొలసిన చూడ్కికి జొబ్బన చూఱగాదె"
"కొనిరమ్మా చూతముగాని నీ గమనవేగంబుఁ"
"పిడుగుపడినవానిం గొఱవింజూఁడిన తెఱంగున"
"ఏడు సాగరములు నిక్కడక్కడఁ బెట్టి పలుచని
రొంపి మై నలఁదికొనఁగ"
"వెనుకఁ గూడఁగ పుట్టిపట్టుకొని తన్నుఁ బల్కరింకేటికిన్"
"అకటయాఁడుకూయునాలకూయు లాఁతివారికైన నరయవలయు"
"వీఁడొకటి కాదవునా నెరుంగండు"
"నెయ్యంబు తియ్యంబు నెఱప నడచి"
"వన్యసత్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియుఁ మొలపదె"
"నావలని మన్నన యట్టిదకాదె"

"సారథి నారయఁచున్నవాఁ డెఱింగినవని సెప్పఁగావలయు"
"బొమ్మ పొత్తికలయుండెండి"
"వసుల దయ్యమెఱుఁగు వడఁతులసంకోచ మేల నాకు"
"ఎవ్విధిఁ జవి లేమి యనుచు"
"చెప్పఁబోదఁగిరి నింకఁ గొలఁత వెట్టఁగ నేల"
"ఏచి మున్నీరు చే యీఁతనీఁద"
"తగిన వారి చెవికిఁ జేఁదు గాఁగ"
"చిత్తములం జెడసేయునట్టి తరమే మీరల్"
"తానట నన్నదికించువాఁడిసీ"
"తనపేరికొలఁదిచూపి క్రీడి సెలఁగె,
"కన్గిలిపిన మాత్రలోన
"తొల్లింటి చూలుగలదె.
"వనిఁదెగు కౌంతేయుఁడు సారఁడుగాని క్రౌర్యంబునకున్
"నివరనాయించక లేక పటపవలయు రథంబున్"

ఇఁక భాషావిషయమునుఁ బరికింపఁగా నీతనికవితలో నిప్పుడర్థము మాఱిపోయిన పదజాలమెంతైనఁ గనఁబడును. ప్రయోగ వైఖరియందును ప్రాచీనభాగుణమును బయలువెట్టు సందర్భము లనేకములు కలవు. ఇప్పుడంతగా వాడుకలోలేని ధాతువులు, భిన్నరూపములఁ జెందిన ధాతువులు ననేకములు గనఁబడును.

కూరు— అకకూరిన మదితోన్ =కలుగు—'ససికి జాలఁ గూర్తు నేను'=ప్రియుఁడు cf కూరిమి *etc.* త. కూర్=అధికమగు, పొందు. త— అకకూర్న్దదు

ఉడిపోవు= తొలఁగిపోవు శక్తిని గడికండలు సేసిన జూచి యప్పు డాతం డుడిపోక.—ఉడి+పోవు, ఉడుగు+పోవు—కాదు.

ఇప్పుడు దీనినుండి 'ఉడుగు' అనుధాతు వేర్పడినది. కన్నడమున ఉడగు అనియు కలదు. కావున 'ఉడుగు' అనుదానికి ప్రాచీన మూల

రూపము. "ఉసి"యైయుండును ఉసి+అగు = ఉసిగు స్వరసామ్యముచే (*Vowel harmony*) ఉసుగు, ఉదుపు అయియుండును.

త్రెయ్యు—త్రెస్సిన "కాంతల వంకులగతిఁ ద్రెస్సితొరఁగిన హార ముల్" "త్రెవ్వు"-కూడఁ గలదు. "వంధవలు త్రెవ్వితలలు వసుంధరరాలె" దీనినుంచి ఇప్పుడు 'తెగు' ధాతువుగా నేర్పడినది. క. తెగె.

ఎలయు—సిరియెలసి పొదల దీనినుంచి ఎలమి, మొదలగు రూప ములు వచ్చియుండును.

తెలియు—బలంబులు తెలిసిన వేల్మీనిన. వాడుకలో నిప్ప టిక నప్పటికి గల భేదమును గమనింపుఁడు.

విఱుచు = ఓడించు "హాంతకారి విఱిచినయట్టు లగ్గలిఁ విరుతు." తత్సైన్యము సెడ, విఱిగిపాఱి భీష్ము మరుపనొచ్చె." తునుగు, "తునుగు" అనునర్థ మిప్పటివలెనే యా కాలమున నున్నను, పాఱువిఱి గిన పన్నట్లుగా సేనలు విరిగినవనుట యిప్పుడు ప్రసిద్ధము కాదు, "విఱు" అనునదే "వేఱు" రూపమును గూడఁ బొందినది. విఱిగియే వేఱగుట.

వ్రేఁగు = భారము—వ్రేఁకన, వ్రేఁకము, వ్రేఁకఁదనము—అను రూపములుఁ కూడ గలవు "వ్రేఁకదనము దోచునట్లు చరింతుగా" "వ్రేఁగు పెద్దన నోడ వారిధిఁ దరింపలేని భంగి"—భా. శాం. ౫ ఆ. ఇంవరి యర్ధానుస్వారము—"వ్రెంచురూపమును సూచించుచున్నది. కన్నడమున ప్రోవుచేయుట, నొకవానిపై నొకటిపెట్టుట (*to collect, to heap up*) అనునర్థమున "బెరంచు" అను ధాతువు కలదు, బెరంచు. బెరంగు. వెరంగు. వ్రేఁగులకు సంబంధము కనఁబడుచున్నది. శబ్దరత్నాకరమున వేఁగు=తపించు, అను దానికిది మొదటిరూపముగాఁ దెలుపఁబడినది. కాని తమిళ కన్నడములలో "తపించు" అనునర్థముకల సజాతీయరూపము (*cognate forms*) రేఫలలో నెచ్చటను గానరాదు. "వెం" ధాతువు కన్న. బెంకి=వేడిమి, నిప్పు: తమి. వెక్కై; మల. వెచ్చు, వేడియగు; కన్న. బెచ్చగె. బెచ్చనె; మాను=వేడిచేయు, తె. వెచ్చన. తమి. వెయిల్=

సూర్యునివేఁడిమి, ఆతపము. మళ- వెయిల్, కన్న. బిసిల్ వె-వెట్ట, వేఁడిమి. ఇన్ని రూపములలో నెచ్చట రేఫము లేకుండుటచే వేఁగు-ప్రేఁగులకు సంబంధమును గూర్చి సందేహింపవలసి యున్నది. ఇతర్థ ప్రేఁవదనము-(ద్రౌపది) గమవతనము. (*dignified nature*)

అఱఁగు=క్షయించు, నశించు. "ఉక్కఱ ఁదింటింతు" *cf.* పెంపరు. తమిళ. అఱు=కోయు (*to cut*) అఱిత-అఱ్ఱుం=అంతము (*the end*). ఇప్పటిది 'గు' అంతమందు గ్రహించిన అఱఁగు (=జీర్ణించు) ధాతువై వాడుకలో నున్నది. కాని 'అఱు' రూపమున నంతగా లేదు. కన్న- "అఱవె" = జీర్ణించిపోవుట. (*the state of being decayed or worn-out.*)

కిట్టు=సమీపించు. "మృగనాథునై నను గిట్టెపుట్టి." ఈధాతువు తమిళ, కన్నడ, మళయాళములందీ యర్థముననే కలదు. కన్న-కిట్టు-గిట్టు *to touch, to reach.* తమి.కిట్టై; మళ-కిట్టే= *to reach, to approach.* కాని యిప్పుడు తెలుఁగులో నంతవాడుకలేదు. అది నాకు గిట్టదు అన్నచో నీధాతువే ప్రయోగింపఁబడుచుండెనేమో.

కొఱలు=ఉండు, పొందు. (శ. రత్నా.) "కలువకతతక్క రుచిత ప్రకారము శుభముం గొఱలుహితులు" ఇది ఇప్పుడువాడుకలో లేకపోయినను, దీనిస్వరూపమే కావఁయు కొఱముట్టు, కొఱగామి అను పదములలోను "కొఱకు" (=ప్రయోజనమునకు) అను చతుర్థీవిభక్తి ప్రత్యయములలో గానవచ్చుచున్నది.

మెఱయు=ప్రకాశించు-బయలువడు (శ. రత్నా.) "తామెఱసి బయలుపడఁ జెల్లఁగవిచ్చలవిడి భోగింపక" ఇప్పుడు మెఱుపు మెరిసినది. ఆ వస్తువు మెరిసి పోవుచున్నది. నేను, మెఱసితిని. తాను మెఱసినాఁడు. అను ప్రయోగములు విరళములు. మెఱ ధాతువు కన్నడమునను గలదు. "ఎంత తెలివుల నేర్పుల్ మెఱయుచు" ఇట్లు సకర్మకముగ నిప్పుడు ప్రయోగమున లేదు.

పెలుకురు=విహ్వాలించు-చలించు; "పెలుకురి తాళంబీ మదిఁ దలఁచి." ఇప్పుడిది వాడుకలోనుండిపోయినది. బెదఁకు అనురూపమునఁ దరువాతి ప్రబంధములలో చలించు అను నర్థమునఁ గాననగు. కన్నడమున పెళర్ (=భయే.) అళ్కురు బెళ్కురు అనియు తమి-పెళ్కు (=*fear, alarm*) అంజు, అనియు గలదు. ఈ అంజు ధాతువుకూడ నిప్పుడు వాడుకలో లేదు. *cf*- "అంజెదవుగాక నను చెంతం జేరఁగనీక"-ఉత్త-హరి.

ఈడంటోవు=వెనుదీయు. (శ. రత్నా.) "శార్దూలకుందాలాదులతో నీడంటోక పెనంగి" తమి, కన్న-ఈడు-ఈణ్ణు=కలియుట (*coming, together, join, equality*) అని యర్థము కలదు. సమానముకాక-అతిక్ర మించి యని యర్థము కానోపు. ఇది యిప్పుడు ప్రచారమున లేదు.

నెక్కొను—"పొల్తి పైనెక్కొను చూడ్కి" నెల+కొను= నెక్కొను. *cf.* నిల్+కొను=నిక్కొను, నిక్కు. *cf.* తమి-నిర్కుం-నిక్కొదు [నిర్కొదు] నిల్లాదు = నిలువదు.

దొరకొను—లభించు, యత్నించు, సిద్ధించు. [శ. రత్నా.] "పెలు వారలు దమ మెఱఁగెదు, తెఱఁగుల దొరకొన్న వింత తెలవుల నేర్పుల్ మెఱయుచు" ఈ రెండుధాతువులు గూడ నీకాలమున నకర్మకముగనే గాని సకర్మకముగ ప్రయోగింపఁబడుటలేదు. కావున పై యర్థము లిచ్చుట సరిపోవునట్లులేదు. తమ తెఱగులను తెలిసికొని నట్లయితే వానిగూర్చిన జ్ఞానమును లభింపజేసికొనినట్లయితే అని యర్థము చెప్పుకొనవలసి యుం డును. ఈ దొరకొను నుండియే అకర్మకధాతువు దొరకు ( = లభించు) అనున దేర్పడిన ట్లున్నది. అనఁగా దీనికి ప్రాచీనరూపము దొరకొను గానోపును.

తగులు—"సంక్రందన సూతికిన్ దగిలి కన్గొనఁ జాలదె" = సక్తమై, ఆసక్తితో ఇప్పుడు తాఁకుట అని యర్థము. అధునికకన్నడము నను-తగులు కలదు. ప్రాచీన కన్నడమున-తాగు = *to touch* తాంగు, ఇప్పుడు తగులుకొనిపోయినాడు అను నప్పు డీయర్థము గాననగు.

తనుకు___"మదనాగ్ని జ్వాలలు తనుకఁగ = జ్వలింపఁగా. ఇది సందర్భానుసారముగులక్షణార్థమై యుండును. "తాఁకుటయే" మూలార్థము–అంటుకొనగా అనుట యుక్తము. ౘ తనుకు నుండియె తాంకు– తాంగు తాఁకు వచ్చియుండును. – కావున తనుకు తగులు లకు తాఁకు సంబంధమును గలుపుచున్నట్లున్నది.

ఏచు = విజృంభించు "ఇందిరాసంపను నాజ్ఞయేచి భువనంబులఁ బ్రబ్బెడె" – దీనికి మూలరూపము ఏరు [ = ఎక్కు ]; తమి. ఏరు = *to arise*; తెలుఁగున – ఎత్తు. ఏతాము, ఎక్కుట మొదలగు పదము లీధాతువు నుండి యేర్పడి యుండును. "దానికేసి పోవుచున్నాడు, వానికేసి చూచెను" అని వ్యవహారమునఁ గల ఏసి అనునది ఏచి యొక్క రూపాంతరమై యుండనోపు.

సుడియు___"కరువలి సుడియుచు కదలక చెన్నొందు" తె – సుడి, సుడిగుండము. అను వానిలో నీ ధాతువు కనఁబడుచున్నను, ఇప్పుడది వాడుకలో సుట్టు – చుట్టు అనురూపముననే యున్నది. కన్న – సుత్తు.

చూఁడు___"కొలువింబూఁడిన తెలుఁగున" తమి–సుడు: కన్న–సుడు( = దాహా) 'చూడాయిరుక్కుదు' 'వేడిగానున్న' దనుట కిప్పుడు తమిళమున వాడుకలో నున్నది. ఇది యీయన్నిభాషలలో మిగుల ప్రాచీనంబగు ధాతువులలో నొకటి. ఇటీవలికాలమున నిది తెలుగులోఁ నంత వాఁడుకలో లేదు.

అప్పళించు = కన్న–అప్పళిసు = కొట్టుట– "బాహాప్పళించి"

పంబు___"పంబినకోపమున్ సమయభంగభ గాఁబును నగ్గలించి" అతిశయించు. ఈధాతు విటీవలికాలమున బొ !గా వ్యవహారమున నున్నట్లు లేదుగాని, కన్నడమున, పర్బు–పబ్బు–హబ్బు ( = వ్యాపించు– అను రూపములుగలదై యున్నది.

తఱుగు—"నీమేను చెన్నుఁ దఱిగె" = తగ్గు. 'తఱుఁగు'లో నుండియే-'తగ్గు'-వచ్చినను ఇప్పుడర్థమునఁ బీనికి గొంత భేదముకలదు మూలధాతువు తల్. తల్ + అగు = తఱగు = ఖండించు,—తర్గు— తగ్గు—తక్కువ.

నచ్చి = నమ్మి "మీలావునచ్చి" అమ్మా నినునమ్మి చాల విష మంబగు విప్వనవాసము కొప్పికొంటి" అని నమ్మి ప్రయోగము కూడ నందే కలదు. ఇది నాకు నచ్చినది అనునప్పుడుమాత్రమే మీ ధాతువు ప్రయోగింపఁబడుఁ చున్నది. కన్న "నచ్చు" విశ్వాసే. ( = ) ధాతువు ప్రాచీనభాషలోనే కలదు. ఆధునిక భాషలో నది "నంబు" అను రూప మును బొందినది. తెలుఁగునను నంబిక - నమ్మికయను రూపము కలదు కదా.

భావించు= ఎంచు - తలఁచు (శ. రత్నా.) "పాంచాలి రావిం చి సుదేష్ణ తృష్ణభావించుచు నిట్లనియె" మదిలో తృష్ణను తలంచుకొనిన నిచ్చుట లాభమేమి? తనకు తృష్ణ కలిగినట్లుగా నెదుటివారికి "ముఖవికా రాదులచేఁ నగఁబఱచుచు"నని యర్థము చెప్పుకొనవలసియున్నది.

"భరమున నీపోరెడునెడ
బరమవిషాదంబు నీవు బలిమి మెఱపియు
ద్ధురవృత్తి జయము గొనినం
బరితోషము బొందు నన్ను భావించిమదిన్"

వ. ఊహించి

"పలలుని దెస మాలిని చూ
డ్కుల తెఱఁ గెదపొందు దెలివెడుం గంటిరె"

అని పలికినది.

విషాద సంతోషములు కలిగిన సమయమున ద్రౌపదిని "భావిం(చి)" ఆమె ముఖవికారాదులను గుర్తించి,ఊహించి - మదిలో తర్కముచేసి - చూడ్కుల తెఱంగునుబట్టి యామె "యెదపొందు" హృద్గతాభిప్రాయ

ముగా గనిపెట్టినవట సుదేష్ణ. అనఁగా సుదేష్ణ భావించినది – కనిపెట్టినది ద్రౌపది చూపులం దెలిసెను. పిదప నాయా వికారలక్షణములతోఁ గారణమును 'పరిసూహించినది.' దీనిఁబట్టి 'భావించుట' బాహ్యవ్యాపారము, 'ఊహించుట'–మదిలో జరుగు నాంతరంగిక వ్యాపారముగాఁ గన్పట్టుచున్నది. మనుజ ద్రౌపదిని భావించి సుదేష్ణ తృష్ణ భావించుచుఁ బలికినది. అనఁగా తృష్ణ కలిగినట్లు ముఖవికారాదులచే వ్యక్తము చేయుచునుండి యనుట. సందర్భమునుబట్టి యిట్లుగా నీపదము నర్థము మారుచున్నట్లున్నది. తిక్కనార్యుని భాషా ప్రయోగవైచిత్ర్యము, దానివలన భాష కెట్టి యపూర్వశక్తి కలుగుచున్నదో గమనింపఁదగి యున్నది.

అగ్గము..."అపదలకు నగ్గంబయ్యెఁ"=అధీనమయ్యెను. ఇది యిటీవల కాలమున నంతగా వాడుకలో లేదు. కాని దీనినుండి యేర్పడిన 'అగ్గమగు', 'అగ్గము', 'అగపడు–అను ధాతువుమాత్రము–అధీనమైనది కంటఁబడునది గావున, 'కనఁబడు' అనునర్థమున నిత్యవ్యవహారములో నున్నది.

ఈఁగు=తొలఁగించు, నివర్తించు "ఆంధ్రకులంగము నీఁగఁజాలువారు." కన్నడమున నిది 'నీగు' (=నశించు, పోఁగొట్టు) అన్యరూపము గలదై యున్నది. త. నీంగు cf. నెగయు, ఎగయు. నణత్తు-అణత్తు.

"ననునాఁగకు, క్రొవ్వరుగ దేని తఱపడు"-అను సందర్భమున 'అగు' ధాతువువలెనే 'ఈఁగు' కూడా ప్రాచీనకాలమున నకర్మకముగాఁ బ్రయోగింపఁబడి యున్నది. "మెఱయు, కురియు" మొదలగున విట్టివవే కములింకనుగలవు. cf. "లోచనదీప్తులదర సుంకించిన నాఁగి యాఁగి" (=ఆఁపి యాఁపి).

"మనంబున వాంఛలకుఁదగంగ నీకేవిధి నీఁగువాఁడ" ఇక్కడ నిచ్చునను నర్థముగనఁబడుచున్నది. అది 'నీఁగు', ఇది 'ఈఁగు' నగును?

తరమిడి=వరుసగా. "తరమిడి చంపింపఁజూచెదవు" కన్న-తర పిడిదు. ఈయర్థము, ఈపదముకూడ నిప్పుడు వాడుకలోనున్నట్లగపడదు.

కాని 'తరువాత' తర్వాత అనుపదము "తఱిము"=క్రమము-అను నీ రూపమునుండియే యేర్పడినట్లున్నది. cf. కన్నడ-తురు. "తిరితిరంబు."

మ్రోసిరి— "ఇట్లని మ్రోసినను పురమునందును మీయుడు—" మ్రోయు—ధాతు విస్తృతి కలదు. "మ్రోఁగు"-మోఁగు అయినది. ఇదియే ప్రాచీనరూపమైన ట్లగపడుచున్నది. తమిళ-ముఱంగు, కన్న-'మొఱె' మొఱగు-మొఱయు-మ్రోయు-మ్రోగు—(cf)కుక్క మొఱుగుట, 'మొర' యాలించుట, మొరపెట్టుట. అందియల మొఱపము_etc. "జనులు మ్రోయుట" మాత్ర మిప్పుడు వాడుకలో లేదు.

తివురు = మ్రోఁగు—"దెసలు బీటలు వార తివురు చిందములు." దీనికి కోరు, యత్నించు మొదలగు నర్థములనేకము లున్నవి. కాని యిది యిప్పుడు వాడుకలోనే లేనట్లున్నది.

ఎద్దు = వెంబడించు. ఎద్దు మెద్దుముదవయ మెదవ మెసగ"—తన్న. తమి—"ఎద్దు," ఇది ప్రాచీనధాతువేగాని యిటీవల తెలుఁగులో బొత్తుగా నంతరించినట్లున్నది.

త్రెక్కొను = త్రాగు-మింగు "నడుమమెఱసి బడబాగ్ని దళంబై జలనిధిఁ ద్రెక్కొనియెడునోజం." ఇదియు వాడుకలో నుండి తొలఁగినది.

ఉదిలగొను =పరితపించు (శ. రత్నా) "ద్రౌపదిరూపమును నుదిఁ దగిలి తనదు హృదయములు మృగము త్తలినుదిలగొనుచు." అట్లు మది నాగ్నినుదిలగొని యగ్నిదేవుం డక్కాంతతో విట్లనియె." అగ్ని సంబంధము కలిగినపుడు పరితపించు నను నర్థము యుక్తముగనే గనఁబడును. కాని యీ ధాతు విటీవలికాలమున వాడుకలో నుండి పోవుటచే దాని మూలార్థమును నిర్ధారణచేయుటయు గష్టమే. ఈ ధాతువుయొక్క మూల రూపమును నిర్ధారణ చేయుటలో నితర ద్రావిడ భాషలు కొంత తోడ్పడ వచ్చును. తమి. ఉదై = తన్నుట (*to kick*) ఉదైత్తుక్కొండ్రు=తన్ను కొను. కన్నడమున "ఒదె"—పాదప్రహారణ (*to strike with the foot*) (ఒదెదాడు-ఒద్దాడు=తన్నులాడు) అనియు ధాతువులు కలవు. "మృగమురిఁ

దగిలి యుదిలగొను" అను సందర్భమునందుదిలకొనుటకు "కొట్టుకొను, తన్నుకొను" అనునర్థమె యుక్తతరముగా గనఁబడుటచే, ఇదియె దాని మూలార్థమనియు, పరితపించు ననునది= లాక్షణికార్థమనియుఁ దలంపఁదగి యున్నది. ఇట్లే తిక్కననాఁడు వాడుకలో నుండి తరువాత వాడుకలో నంతరించిన ధాతువులయొక్కయు రూపముల యొక్కయు, వాస్తవార్థమును నిర్ణయించుటకు నితర సజాతీయ భాషారూపములు కొంతవఱకుఁ దోడ్పడుచుండు ననుటకు సందేహము లేదు.

కెడగూడు "కెడగూడ దీని సీతని యొడలిపయిం బెట్టి కాల్పు టుచితం బదయన్" = చచ్చిపోవునట్లుగా లేదా - చెడిపోవునట్లు. శబ్దరత్నాకరమున నీరూపము గ్రహింపఁబడలేదు గాని 'కెడయు=చచ్చు, పడు-అనురూపము తెలుపఁబడినది. కన్నడమున కెడు= వినాశె (*to be ruined*) అను ధాతువు కలదు. తమిళమున "కెడు"= పాడయిపోవు అనుధాతువు కలదు. త. కెడు "కెట్టాన్" = పాడయిపోయినాఁడు. తాలవ్యమ్మగు "ఎ" కారసాహచర్యముచే "కంఠ్యకకారము" తాలవ్య "చ" కారముగా మారి తెలుఁగున "చెడు" అను రూపము కలిగినది. చెడునుండి-చెట్ట వచ్చినది. కీడు అను ప్రాచీనరూపము కూడఁ గలదు. ఇప్పుడు చెడిపోవు అను రూపమేగాని కెడగూడు గాని కెడయు గాని వాడుకలో లేవు. మఱియొక రూపము కీడ్పడు అనుదానిని కూడ తిక్కన వాడినాఁడు "పేదయనఁ గీడ్పడియుండెనో కాక"

అలిగొను= అవహసించు—"అకట సైరంధ్రి నన్ను నిట్లలిగొనఁగనేల". ఇప్పుడిది వాడుకలోనున్నట్లు లేదు. సంస్కృతధాతువు పరిభవించు అనునది దీనిని వ్యవహారమునుండి త్రోసివేసినది. కాని కన్నడమున అళె పరిభావే [*to slight, to disgrace*] ' అనుధాతువు కలదు. 'అళిగొళ్=అవహసించు, మోసగించు. కావున నిదియు ప్రాచీన ధాతువుగనే పరిగణింపఁదగియున్నది.

పుల్లగిల్లు=భయపడు (శ. రత్నా) "పుయిలోట మోమున పుల్లిగిలగ." ఇచ్చట నీయర్థము కుదురదనుట స్పష్టమే. భీతివలనఁ గలిగిన

వికారము మోమున వ్యక్తమైనదనియాఁ పుల్లని వస్తువు దినినప్పుడు మోమెట్లు పుల్లంతుమో అట్లయ్యెనని యర్థము కానోపు.

ఈను — "మాని సంపదలీనుచుండు" — సంపదల నీనుట. మఱియొక సందర్భమున నీధాతువు ప్రయోగింపఁబడుచున్నను అట్టి ప్రయోగము లిప్పుడు వాడుకలో లేదు. [తమి. "కలుప్పు ఈనుం కల్వ్యాముడ్ ఈనుం" = మోక్షము నిచ్చును శుభ మిచ్చును. ఈన్ నాళ్ = తల్లి. తెలుఁగు కన్నడముల తిర్యక్ప్రసవమునకె 'ఈను' తమిళమున నట్లుకాదు")

ద్రావిడ భాషలో ధాతువులతోఁ బోల్పఁదగి సజాతీయములైన (*cognate forms*) రూపములు గలిగి తిక్కనచే ప్రాచీనం బగు మూలార్థమునఁ బ్రయోగింపఁబడి యాంధ్రభాషా చరిత్రమును బదచరిత్రమును దెలిసికొనుట కత్యంత సహాయమును జేయునవై యున్నవి.

ఇంకను విచిత్రములగు ప్రాచీన ప్రయోగములు మఱికొన్ని కలవు. క్రియారూపములలోను, కారక ప్రయోగమున గూడ ననేక చిత్రములు గానవగును,

మూదల = తాఁకఱము. క్రియారూపమున "మూదలించు = హెచ్చరించు"ను నర్థమువచ్చినది. మున్ + తల అనఁగా ముందుతల చూపునది మార్గదర్శి అనునది మూలార్థము కావచ్చును.

పలను — "వంటలనైనను పలనేర్పడగ నొకభంగిఁ జేయఁగఁ జేసి పాడిగానగ" = తగినవిధము, ఇప్పుడు అవలను ఈవలను — అవల, ఈవల ప్రక్క = పలన అనునది. మూలార్థమును గోలుపోయి పంచమీవిభక్తి ప్రత్యయమై స్థిరపడినది.

విచారము — "పితృకార్యము చేయఁగా విచారమ్మనుచున్న" "అదియకావగబి" — వీనియర్థమునందలి మార్పు గమనింపఁదగినది.

పెల్లు — "దుర్దశల పెల్లునకు దురపిల్లుట"

వెంటను — "ఎమ్మెయివని వెంటను — "వాని వెంటఁబడిపోయెను"

అని యందుముగాని, వనివెంట వెళ్ళినాఁడని యిప్పుడనము.

బవిఁ—అనుదానికి "వెఁబడిఁ" అని వెంట పదముతోఁ జేర్చు టంత, వ్యస్తప్రయోగ మిప్పటికాలమున లేదు. కాని తిక్కన ప్రయోగ మున "చనియెంగేకయ సుతానుచారికలబడిఁ" అనికలదు.

చూఱు—"తొల్లింటి చూఱుగలదె." చూఱుగొను ధాతువులో తప్ప చూఱు కిప్పుడువ్యస్తప్రయోగము లేదు.తమి. చూఱైయాడు= కొల్లగొను.

కలిమి—"కాంతాదులతోడి పొందుకలిమి భటునకుఁ" = పొందు గలిగియుండుట. ఇప్పుడు కలిమి లక్షణార్థమగు సంపద యందేగాని, ధాత్వర్థమున వాడుకలేదు. ఇట్టిదె "కోపరసంబు పేర్మిచెరిచెఁ".

గోసెక్కు— "దీని నీవు గోసెక్కఁగఁ జేసి"= దూరు, దోషము- గోసు- ఘోష శబ్దభవమై యుండును. "గోసెక్కు" అను పదబంధము నెంత శక్తివంతముగ (*effectively*) తిక్కన ప్రయోగించినాఁడో చూడుఁడు.

చెటపట్టు— "నన్ను నతఁడు చెట్టపట్టినన్ ద్రోచి వెనంజన్న వెసు కొనుటయు", ఇక్కడ మూలార్థమునఁ బ్రయోగింపఁబడినది. ఇప్పుడు చేపట్టు వివాహము అను నర్థమున రూఢిఁ జెందినది.

మై. "రెండుమైల నడతము"= రీతులుగా

మైమై- "సింహబలుఁడు నిన్ను పరిభవించి మైమైతోన యునికిం జేసి" "మైమై పోరి దుర్గ్రాకృతిన్" అనాయాసముగా- త. మెన్మై = మెల్లమెల్లగా- మార్దవము [తో]

కొలఁది. "లోకుల చిత్తమునకు ప్రేగగు కొలఁదిమనను"- [=రీతిగా] - ఈ యర్థమున నిప్పుడు వాడుకలేదు. [చేసినకొలది లేదా - నా శక్తికొలది - అనియందుము]

మెయివడి = సమ్మతి - "మెయివడి చూపుగా"

వలపు = కోరిక - మూలార్థము. "రిపుంబరిమార్పంగా వచ్చునేని యొట్టిద నావలపు" cf. చేయవలయు -. ధాతువు - 'ఒల్' cf. చేయ నొల్లం. తమి. కన్న. మళ ఒల్, ఒల్లు.

ఓలము = మరుగు - "ఓలము బ గాలు నొక్కొటిగా" దీనినుండి 'ఓలి మానగావియె' అను క్రియారూప మేర్పడినది.

ఒంటికి - "ఏచిచలంబున నొంటికిఁ జూచిన" = వేరువిధముగా?

ఉద్దవిడి - ఉద్ద = మిక్కిలి అనునర్థముగల యుపసర్గ - కావి శ. రత్నా. న దేశ్యమనియే చెప్పబడినది. "ఉద్దవిడిన వసుల నూచ ముట్టుగఁబెత్తు" = "మిక్కిలి విడిపోయిన" cf. నన్నె. కుమా. ఉద్దవరి.

తరము - "తరమెఱిఁగి" - "మేల్తరములు"

"ఎందు లేకునికి వలన - [లేకుండుటవలన]

"విచ్చి జనినమస్త దేశంబులుం గ్రుమ్మరి" = విడిపోయి. ఇప్పుడు విచ్చి = విప్పి - విడదీసి.

చాలుట - కార్యంబే చందంబునఁ దెఱఁగగునా చాలుట కోర్వ వలయు. తమి - చాలు; క - సాలు = *to be sufficient*

కురుచ - "నావలుకులు గురుచసేయక"

అటె - "జయలక్ష్మిం జేకొనునటె"

రూపు - గుబ్బములను రూపుగా నరయుట.

పొందు - వారు తమతమపొందువట్ల కేగిరి.

తేరు - "గోమునమైఁగంద క్రొవ్వుదేలఁపెట్టు" = క్రొవ్వుపైకి గనబడునట్లుగాఁ జేయ

తేజము - "ఎంత తేజమైనవాని బుద్ధిగలుగు వారొల్లరు"

తమము - "కాంతారంబున తరిమిపోవు సమయంబున" = త్వరి తపడు - ఈ యర్థమిప్పుడు వాడుకలో నున్నట్లగపడదు - ఇప్పుడు "తరిమికొనుపోవుట" యని కలదు.

మొఱవము = ధ్వని "అందియల మొఱవంబున కరుగుదెంచి"
ధాతువు - మ్రోఁగు - భాషా మొఱపాలు?

"మూరసించు", "అర్జునుఁడు గవియించిన యంప మూరసించు దళముగఁ గప్పిన" - తమి. మూడు = మూయు. మూసుకొని వచ్చిన మంచు - మూరమంచు

ఓజలు మెఱయు — భీముఁడనేక విధముల నోజలు మెఱయుచు.

ఉఱుడిల్లు — "ఇట్టి పనికి నూఱుడిల్లి తోఁచుకొనగ నిచట నీదగు మట్టంబుఁదప్పి వర్తము వాఁడనొక్కొ." = ఉపశమించు

"విఱ్ఱీసిన మదనునిచే ధృతివాసిన సింహబలుఁడు." చే=తృతీయార్థము 'మూలముగా' ననియా?

"ఇష్టు దానియొద్ద కేగు దేవలయాడివని సేయఁగ బూని"

"దీనిపై నెయ్యముకల్మి యే కొలది నీమదికింతయు నాకుఁ జెప్పుమా" - షష్ఠీప్రయోగ విశేషము గమనింపఁ దగినది = నీమనస్సునకు దీనిపై స్నేహముండుట?

"ప్రియము చూడ్కి—మునుఁగుపడఁ దనుసంభావించు నెడ"

దెస = దుంవస్థ = అవస్థ - "తనవేచవుడెస యొరు లెఱుంగక యుండఁగా" ఇప్పుడు 'దిక్కు' 'వైపు' అనియె యర్థము.

బ — కలిమికి నొప్పగు సిగియు బలిమికి దొడవైనయట్టి బలగమునై." = బలగము కలవాఁడై యను నర్థమున.

"మత్స్యపతిమను దనయులకలోనివాఁడ కాఁదలంచి"

"పలుకంగఁ జాలఁడయ్యెడు నకటా"

"శౌర్యవైభవ ప్రాభవశౌచములకు నొరులకైనఁ గైవారమై యుల్లసిల్లు"

"తనపవర్తనమువిన్న మునిజనంబులకై ననలవరించుకొనగవలయువాఁడు"

"కత్తఱికత్త చెలగినవ్వు"

"తమయన్నకు నగ్గియిచ్చువారై"
"వారేమనిరేని మఱియుం దగనాడి"
"నీమాటలకు నేమిగులంగా నెఱుఁగఁబోదు మీదెట్లుండెఁగా"
"మనకు మార్కొనునట్టి కొలఁదికాదు"
"బాసట లేరమెవ్వరున్"
"తనతన వాహనములాయుధములెల్ల జనంబులననువుసేసికొనుచు"
"ఇవి నీ తెగకొలఁదివి."
"పాండునందనులయన్న యిమ్మెయిఁగానవేఁడి." తమి. వేండుం
"బల మెల్లఁగా నెఱిఁగెండురూపాయలుగఁ బొచ్చి"
"నాలుపుగఁ బోయి"
"భయరసము పట్టు పెట్టునఁ బగలువాలు"
"పెద్దదొరలు చీరలొలుఁ(పబడిరి"
"పతియెటులుఁగఁటొకో జనులు నిజము సేయుదురే"
"దుఃఖములకు నగపడకుండ"
కీచకుఁ బరిమార్చుటకిపుడు గడవఁబడియెనే"

కారక విశేషములు

"జంతకు నేర్చునీకు"
"నినుం గొనియాడుచేతఁ దానెంతయుఁబెద్ద"
"తద్వృత్తమునకు వన్నెలుము.
"యముడనిచే నగపడ్డవీని ప్రాణంబులు.
"వినరి నేలతో(వేసి పిప్పునవుండి వెట్టిన"
"కీచకుని దెస నన్నొకకీడు తెరవు వొరయకుండగావునను"
"కీచకుదురాచరణంబు నాకుఁ(బకటించి"

"ఇట్లు లోక మూర్ఖునిచేఁదుదిఁబోయి కోలుపోయిన యభిమానము"

"పృథాసుతుల దిక్కునఁ దప్పయఁ బీతుఁడై"

"వారికిన్ విలాపముసేసె"

"తలపోతగలిగి యమ్మొలతిపచ్చుటకుఁ దానొంటు పంతలు పుట్ట
జంపనొక్క"

"గంధర్వులచే పడి మృతినొందె"

"సైరంధ్రి కపాయము వొందదని యూహించి"

"వారికినుతింపగ నేల నిసర్గవృత్తముల్"

"మాకుంజూడ పాండవులు పొడపడంగి లేకపోయిరి.

"నాతోడి ప్రేముడింగడు నాతురయై"

"ఏమని విడిమెదనో నీచేనను."

"వారలకు వగవపలదు."

"అతని నెవ్వరికేనియుం బొగడవలయు."

"పావమున గురులకు మాఱ్కొనియెదము"

ఇట్లు తిక్కనార్యుని యాంధ్రభాషా జాతీయప్రయోగ చమత్కా
రము లపారములై వెలయుచున్నవి. అతనిభాషాశక్తి, ప్రయోగ చమ
త్కృతి, జాతీయపైఖరి, పదసంగ్రహణ నైపుణి, యనన్య సామాన్య
ములు. అప్పటి తిక్కనార్యుని భాషకును, ఇప్పటిభాషకును విశేషవ్యత్యాస
మగపడుచున్నది ధాతు, పద, కారక, క్రియారూప, జాతీయప్రయోగ
విషయమున నెంతేని భేదముకలదు. అతని కాలమునందలి యాంధ్రభాషా
స్వరూపస్థితిని గనుగొని, అది కాలక్రమమున నెట్టి మార్పులకు లోనై
ప్రస్తుత స్థితికివచ్చినది, అప్పటి యాతని భాష యెంతపఱకంతరించినదియు
తెలిసికొనుటగా నాతని భారతమందలి దేశీయ పదముల పట్టి కలను
తయారుచేయు టెంతయు నావశ్యకమై గన్పడుచున్నది. వీనిని తరువాతి

భాషతోడను పూర్వకవుల యొక్కయు శాసనములయు భాషతోడను బోల్చినచో నాంధ్రభాషాచరిత్రమును గొంతవఱకు దెలిసికొనుట కవకాశ మేర్పడఁగలదు.

## ఉపసంహారము

ఇట్లు సహజంబై, సలక్షణంబై, శక్తివంతంబై, జాతీయ యుక్తంబై, దేశీయబహుళంబగు నాంధ్రభాషతో, భవ్యకవితా వేశుండు, విజ్ఞాన సంపద్విఖ్యాతుఁడు, సంయమిప్రవర సంభావ్యను భావుండునగు కృష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠంబూని రచించిన లేఖ్యంబగు నీ యామ్నాయమునందలి యర్థమును ప్రబంధమండలిగా రచించి యాంధ్రావళికి మోదముం గూర్ప నెంచిన తిక్కనార్యుఁడు "హృదయాహ్లాది, చతుర్థ, మూర్జితకథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి" యగు నీవిరాట పర్వమును రచించు సందర్భమున సంస్కృత మూలమునందలి యర్థమును కావ్యకళాదృష్టితోఁ జూచి యందలివిషయముల యౌచిత్యానౌచిత్యములను, గుణదోషములను బరిశీలించి మూలమునందలి యే విషయమెచ్చట నుపయోగించుకొననగునో దానినచో నుపయోగించుకొనుచు, సందర్భానుకూలముగఁ రసమును బోషించుచు, పాత్రలశీలమును వ్యక్తీకరించుచు, సంభాషణలను బెంచుచు, కథాంశములను దారుమారుచేయుచు, కావ్యకళా సౌందర్యమునకుఁ దోడ్పడని సందర్భములను విడనాడుచు, నద్దానిఁ బోషించుట కనువగు వర్ణనలను-అనఁగా ప్రకృతి వర్ణనలను, శీలపోషక వర్ణనలను, భావస్ఫాయసూచక వర్ణనలను మనోవృత్తి ప్రకాశక-ప్రసక్తి రక-వర్ణనలను, స్వీయదేశీయాచార వర్ణనను సందర్భానుకూలముగ స్వయముగరచించి చేర్చుచు దన భాషాంతరీ కృతగ్రంథము నత్యంత రసోద్బోధకంబై కావ్యకళకాదర్శ భూతంబై స్వతంత్రంబగు నుత్తమ ధ్వనికావ్యముగనొనర్చి ధన్యుఁడై నాఁడు. ఆంధ్రావళి కత్యంత మోదముం గూర్చినాఁడు. భక్తకోటికి వరణీయుఁడై నాఁడు. తానసుభవించిన కవిత్వ

తత్వ నిరతిశయానుభావానందమును దన దేశీయులకుఁ గూడ చవిగొలిపి నాఁడు. ఇక ఉద్యోగాదులగు శక్తిన పదునాల్గింటిలోఁ గూడ నాంధ్రావళి యీ మహనీయుని కావ్యశిల్ప మహత్వము నారసి యత్యంతామోద భరితమై కావ్యరసాంబుధి నద్వైతానందాంబుధి నోలలాడుచుండు గాత !!!

# మా ఇతర ప్రచురణలు

| | | |
|---|---|---|
| సాహిత్య దర్శనం | కె. వి. ఆర్. నరసింహం | 50-00 |
| రత్నావళి | ,, | 3-00 |
| సంస్కృత వ్యాకరణ ప్రవేశిక | కె. ఎ. కృష్ణమాచార్యులు | 25-00 |
| మహాభారతము తత్త్వదర్శనము | డా॥ రామకోటిశాస్త్రి | 5.00 |
| తిక్కన హరిహరనాథ తత్త్వము | ,, | 7-50 |
| యయాతి చరిత్ర | ,, | 3-75 |
| భువన విజయం | పోలూరి హనుమజ్జానకిరామశర్మ | 6-00 |
| గుహుడు | బృందావనం రంగాచార్యులు | 3-00 |
| సాహిత్య కౌముది | గుంటూరు శేషేంద్రశర్మ | 4-00 |
| మాళవికాగ్నిమిత్రము | మోచర్ల రామకృష్ణయ్య | 3.00 |
| వ్యాస ప్రభాస | కొక్కొండ సత్యవతి | 4.00 |
| సుభాషిత రత్నావళి | వెంటాల గోపాలకృష్ణ | 10-00 |
| జాతీయాలు పుట్టుపూర్వోత్తరాలు<br>మరియు సంస్కృత న్యాయాలు | " | 10-00 |
| ప్రతిజ్ఞ | డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి | 3-50 |
| శృంగార నైషధం (3, 4 అశ్వాసాలు) | శ్రీనాథుడు | 2-[illegible] |
| లక్ష్మీ సహస్ర కావ్యం | డా॥ వేదుల సూర్యనారాయణశర్మ | 20-00 |
| అంతరార్థ రామాయణం | " | 20.00 |
| ఆర్య చాణక్యము | " | 20-00 |
| రక్షకభట తత్త్వశాస్త్రం | " | 10-00 |
| శ్రీగురుగీత | " | 3-50 |
| తెలుగులో చాటు కవిత్వము | ప్రొ. జి. లలిత | 45-00 |
| సాహిత్య శిల్ప సమీక్ష | పింగళి లక్ష్మీకాంతం | 25-00 |
| ఆంధ్రభారత కవితా విమర్శనము | కోరాడ రామకృష్ణయ్య | 20-00 |